



పసి బిడ్డకు
జీర్ణసంబంధమైన
బాధలు కలిగినప్పుడు...

సౌమ్యంగా పనిచేసే

# అమృతాంజన్ గ్రైప్ మిక్స్చర్

బాధను అతి త్వరగా తగ్గిస్తుంది

కడుపునొప్పి, అజీర్ణము, వాయువు, పళ్ళు పచ్చేటప్పుడు కలిగేబాధలు మొదలైన వాటిలో దేనితోనైనా సరే, మీ పసిబిడ్డ బాధ పడుతూంటే అమృతాంజన్ గ్రైప్ మిక్స్చర్‌తో అతి త్వరగా ఉపశమనం కల్గించండి త్వరగా సులభంగా తిరిగి మీ పసిబిడ్డ ఆనందంగా నవ్వుతుంది.

గృహౌషధములు
తయారుచేయుటలో
తరతరాలుగా
నమ్మికకు పాత్రమైన
అమృతాంజన్ వారి
తయారి.




అమృతాంజన్ లిమిటెడ్

OBM 3410 TG

# ఆంధ్రసచిత్రవారపత్రిక

వ్యవస్థాపకులు:

దేశోద్ధారక కాశీనాధుని

నాగేశ్వరరావు పంతులుగారు

స్థాపితం: 1908

శివలెంక శంభుప్రసాద్

సంపాదకుడు:

[1938-1972]

శుక్రవారం: 20-1-'78

పింగళనామ సం. పుష్య శు. ద్వాదశి

*సంపుటము 71 : సంచిక 18*

సంపాదకుడు

శివలెంక రాధాకృష్ణ

*

పోస్టులో ఏడాది చందా రు. 41-60

ఆరు మాసాల చందా రు 20-80

విడిప్రతి వెల 75 పైసలు

*ఆంధ్రపత్రిక కార్యాలయము*

గాంధీనగరం, విజయవాడ-520 003


## విషయానుక్రమణిక



కౌముది పిక్చర్స్

# నాయుడు బావ

గంగాధర

ఇద్దరు అందాల రాణులు
ఒకరు ఓరియంటల్ బ్యూటీ
మరొకరు ఒలింపిక్ బ్యూటీ

ఈస్ట్‌మన్ కలర్

నిర్మాత: యం.యస్.రెడ్డి   దర్శకత్వం: పి.చంద్రశేఖరరెడ్డి బి.ఎ

విజయా రిలీజ్

VIJAYA

# మనలో మాట

సంక్రాంతి ముఖ్యంగా రైతుల పండుగ... తుఫాన్, పెను ఉప్పెనల దెబ్బలకు గురియైన ఆంధ్ర ప్రాంతంలో యీసారి సంక్రాంతి కళా విహీనంగా వున్నది... అయితే పై ఏడాది సంక్రాంతికి మనమంతా ఎప్పటిలాగే యీ పంటల పండుగ చేసుకోగలమని ఆశిస్తూ అందరికి మా శుభాకాంక్ష లందిస్తున్నాము. ఈసారి అట్టమీద సంక్రాంతి ముఖచిత్రం వేయకపోవటానికి వేరే కారణం చెప్పనక్కరలేదనుకుంటాము.



బెహరా వేంకట సుబ్బారావు



సి.వి. సూర్యనారాయణ మూర్తి

దీపావళి కథల వరుసను పాఠకులు తమ బ్యాలట్‌లో యీ క్రింది విధంగా నిర్ణయించారు: ★ వన్ మినిట్. ★★ కలకాలం నిలిచేది ★★★ ఆనందానికి ముందు వెనుకలు ★★★★ కామాక్షి కోరిక ★★★★★ పేరు లేని కథ. ఈ ఐదుగురు కథకులకి అడవాపు బహుమతులను రూ 600 లు, రూ 500 లు రూ 400 లు ఆ వరుసలో పంపుతాము చివరి యిద్దరికి కన్సొలేషన్ బహుమతులుగా చెరి 250 రూపాయల నంతున అందజేస్తాము ఇక యీ రచయితల పరిచయాలు యిలా వున్నాయి.

'వన్ మినిట్' రచయిత శ్రీ బెహరా వెంకట సుబ్బారావుగారు 1935లో రామచంద్రపురం తాలూకా పెదపర్తి గ్రామంలో పుట్టారు. ప్రస్తుతం పూసపాటి రేగలో సబ్ పోస్టు మాస్టరుగా చేస్తున్నారు సంతానం యిద్దరమ్మాయిలు, యిద్దరబ్బాయిలూను. 1958 నుంచి రచనా వ్యాసంగం ప్రారంభించి వివిధ పత్రికలలో రచనలు ప్రచురించారు క్యారమ్స్, చదరంగం హాబీలు.

ద్వితీయ బహుమతి పొందిన్న శ్రీ తటవర్తి రామచంద్రరావుగారి స్వస్థలం పశ్చిమ గోదావరిజిల్లా జగ్గన్నపేట గ్రామం. వయస్సు 37 సంవత్సరాలు. మ్యాడిరీ లో టెలికమ్యునికేషన్సు శాఖలో అసిస్టెంట్ యింజనీర్‌గా వుద్యోగం. 1963 లో వివాహమైంది. రచయిత్రి 'విమలారామం' గారు వీరి ధర్మపత్ని. వీరికి ముగ్గురు సంతానం. 1958 నుంచి వీరి కథలు విరివిగా పత్రికలు వేసుకుంటున్నాయి. లోగడ 1973 లో ఆంధ్ర పత్రిక వార పత్రిక దీపావళి కథల పోటీలో భయపెట్టే దేవతలు అన్న కథకి బహుమతి అందుకున్నారు కూడా— "విమలారామం" యిరువురూ కలిసి నవలలు, కథలు విరివిగా వ్రాస్తున్నారు

మూడవ బహుమతి పొందిన 'ఆనందానికి ముందు వెనుకలు' రచయిత శ్రీ పర్వ వెంకట సూర్యనారాయణమూర్తి వయస్సు 34 సం.లు. సి. వి. సూర్యనారాయణ మూర్తి అన్న పేరుతో కథలు వ్రాస్తుంటారు వీరి స్వగ్రామం కూడా పశ్చిమ గోదావరిజిల్లాలోని కాకరపర్రు గ్రామం ఈయన సివిల్ యింజనీర్. ఎల్. సి. ఇ. తర్వాత ఏ. ఎమ్. ఐ. ఇ. పరీక్షలను ప్రథమ శ్రేణిలో ఉత్తీర్ణులై 1963నుంచి ఆంధ్రప్రదేశ్ సాంకేతిక శాఖలో అసిస్టెంట్ లెక్చరర్‌గా వుద్యోగం చేస్తున్నారు. ప్రస్తుతం మద్రాసులో టెక్నికల్ టీచర్స్ ట్రయినింగ్ ఇన్స్టిట్యూట్‌లో డెప్యుటేషన్ మీద వుంటున్నారు. వివాహమైంది. ఇద్దరు కుమారులున్నారు. ఇదివరకు ఆంధ్ర సచిత్ర వారపత్రిక సినిమాలమీద నిర్వహించిన వ్యాసరచన పోటీలో వీరి వ్యాసం సాధారణ ప్రచురణకి ఎన్నికైంది. వీరి మొదటి కథ 'ఎక్కడుందీ లోపం?' అన్నది కూడా ఆంధ్రపత్రికలోనే పడ్డదని తెలియజేస్తున్నారు.

ఇక కన్సొలేషన్ బహుమతి పొందిన



తెంటు రూపసిలక్ష్మి



జి. రంగారావు

# తిల సంక్రాంతి

'సంక్రాంతి సంకెళ్ళలో ఉన్నవారికి కూడా విముక్తి' అని సామెత. ఉత్తరాయణంలో ఉత్తమ లోకాలకు ద్వారాలు తెరచి ఉంచబడతాయట. అంచేతనేమో 'ఉత్తరాయణం వచ్చింది ఉరిపెట్టుకో' అనే సామెత కూడా ఉంది. ఒక పనిని పూర్తిగా విడిచిపెట్టేయడాన్ని తిలోదకా లివ్వడం అంటాం. చేతిలో నువ్వులు పట్టుకుని నీటితో ధారపోయడం తర్పణ కార్యక్రమం లోని భాగం. సంక్రాంతికన్నాముందే తుఫాను భీభత్సం బలవంతంగా ఎందరి భవబంధాలనో త్రెంచి పోయింది ఈమారు ఆంధ్రదేశంలో. అశ్రుతర్పణంతో వారికి తిలోదకా లిచ్చి వేయడం జరిగింది.

సంతాప కార్యక్రమంలో భాగమయ్యే ఈ నువ్వులు సంతోష సంబరంలోనూ భాగస్వాములే. ఆమాటకొస్తే సంక్రాంతి సంబరానికి నవ్వుల సంకేతం ఈ నువ్వులు కొన్ని ప్రాంతాల్లో.

మహారాష్ట్రులు, మాళవ దేశస్థులు సంక్రాంతి పండగలో నువ్వులకిచ్చే ప్రాధాన్యం మనకి చిత్రంగానే వుండచ్చు. కాని వారి ఆచారం కొట్టిపారవేయవలసింది కాదు. సంక్రాంతి పండగనాడు పంచదారలో నువ్వులు కలిపి తొక్కి మనంచేసే చిమ్మిలిలా చేసి దానిని మిత్రులకు, బంధువులకూ ఇంటింటా పంచిపెడతారు మహారాష్ట్రులు. నువ్వులను చక్కెర పాకంలో కలిపి పూవుల్లా తీర్చి ఆ పంపకాన్ని మహారాష్ట్ర స్త్రీలు ఒక ఉత్సవంగా చేస్తారు. "పంచదారతో కలపబడ్డ ఈ నువ్వుల గింజలు పుచ్చుకోండి. సంవత్సరం పొడుగునా మాకు స్నేహితులై ఉండండి" అని చిమ్మిరి ముద్దలు పంచుతూ స్త్రీలు తమ మిత్రులను, చుట్టాలను పలకరిస్తారు.

దూరంగావున్న స్నేహితులకోసం ఒక చిన్న సంచీలో పంచదారతో కూడిన తిలలు (నువ్వులు) ఉంచి దానిని పోస్టు ద్వారా పంపడం మరచిపోరు వీళ్ళు. సంక్రాంతినాడు అలా పంపడం ఆ పొందిన వారికి ఆ సంవత్సరం శుభప్రదమూ, సుఖప్రదమూ కావాలని శుభాకాంక్షలు అందించడం అన్నమాట.



: ఎస్. బజరంగ్

మహారాష్ట్రులు నువ్వులకు జతకలపడంలో పంచదారకు ప్రాముఖ్యం యిస్తే మాళవదేశంలో బెల్లానికి ప్రాముఖ్యం. సంక్రాంతినాడు వాళ్ళు చేసే పిండివంటల్లో నువ్వుపప్పూ, బెల్లం ప్రధానమై వుంటాయి.

సంక్రాంతినాడు స్నానంచేస్తూ నువ్వుల ముద్దచేసి వంటికి రుద్దుకుంటారు. నువ్వులు కాకపోతే తెలకపిండితో వొళ్ళు రుద్దుకుంటారు. పండగ సందర్భంలో మాళవ స్త్రీలు పాతగాజులు తీసివేసి కొత్తగాజులు వేయించుకుంటారు తప్పకుండా. ఆ గాజుల సవ్వడి చేతులతో మధ్యాహ్నం అందరికి నువ్వుల వుండలు పంచిపెడతారు. ముఖపరిచయం ఉన్నవాలు నువ్వులుండ లందించరన్నమాట. ఇంటిలో మగవాళ్ళంతా తమకంటే చిన్నవారికి పంచిపెట్టాలి. భార్య ఈనాడు స్వయంగా భర్తకు తిలలు (తిలోదకాలు కాదు) ఇవ్వాలి.





అయితే ఈ నువ్వుల పంపకం అర్థరహితం అనుకోబోకండి. సంక్రాంతి మార్గశిర పుష్యమాసం. మంచి చలికాలంలో వచ్చేది కదా. అదీకాక సంక్రాంతివేళ సూర్యుడు మకరరాశిలో ప్రవేశిస్తాడు. ఈ మకర రాశికి అధిపతి శని అంటే వాత ప్రధాన గ్రహం. వాతం చేయడం అంటే వైద్యప్రకారం రోగలక్షణమే. నేయి, నూనె, నువ్వులు ఇవన్నీ శీతహరమైనవి. వాతనివారణార్థం అమోఘంగా పనిచేసేవన్నమాట. కాబట్టి వ్రత గ్రంథాలుకూడా మకర సంక్రాంతినాడు తిల, ఘృత, వస్త్రదానం మొదలైన దానాలు చేయాలని నువ్వులతో అప్పు, ఎద్దు ఆకారం చేసి దానం చేయాలని మజ్జిగను మీగడతో సహా దానం చేయాలని పేర్కొంటున్నాయి. వాతాహరణార్థమే ఇదంతాను. సజ్జలు పండే ప్రాంతాల్లో అయితే నువ్వులు అద్దిన సజ్జరొట్టెలు తప్పకుండా ఈ పర్వదినాన ఆరగిస్తారు. మాళవ దేశీయుల సంక్రాంతిలో నువ్వులకు ఇంత ప్రాముఖ్యం వుంది కనకే వారు ఈ సంక్రాంతి పండుగను నవ్వులకు నువ్వులు సంకేతంగా తిల సంక్రాంతి అని కూడా అంటారు. నవ్వుల నువ్వుల పండగ సంక్రాంతిని ఎంతో వైభవంగా చేసుకుంటారు.

—ఎ. కామేశ్వరకుమారి



# పిడుకలవేట!

కంచనపల్లి వెంకటకిషన్‌రావు

"రామలింగం, యిూరోయినుకు ఫోనిస్తివా" అంత పొగాకు చుట్టను కల్లటి పెదాల మీద నాట్యం చేయించటం ...సేసి సిలింఫేర్ చూస్తూ అడిగాడు ప్రొడ్యూసర్ బొడ్డులింగం.

రామలింగం బొడ్డులింగం బామ్మర్ది. బొడ్డులింగం కొత్తగా తీసే కొత్త పిచ్చర్‌కు వోఇసాలింవార్తి. నాలుగు వింగిలీసు ముక్కలు తెలుసు కనుకా, నమ్మకస్తుడూ దగ్గర చుట్టమూ కనుక రామలింగాన్నే కుడిభుజంగా యేసుకున్నాడు.

"ఇచ్చాను బావా, కరెక్టుగా పది గంటలకు స్టూడియోకు వస్తానని అన్నది"

"కరంటుగానే సెప్పుద్ది సెప్పటానికి. మూ(డో)జాల్నుంచి ముప్పతిప్పలు పెడుతున్నది, వస్తకూకుండు, వస్త కూకుండు అనుకుంట"

"(వ్రా)తం చేసుకుంటున్నదట కదా"

"వియ్యవ్వ. అసలు సీగ్రరట్టు వీకేడ తెలుసుద్ది. ఆమె కారు డ్రైవర్ వుప్పేనేం జెప్పిండనుకున్నవ్ నిన్న..."

"ఏఁవన్నాడు"

"యిూరోయిన్ తల్లికి సెడ్డా చారమంట. యిూరోయిన్ బయట్కు యిన మ్యూడోజులూ సూటింగూ గీటింగూ కానిసెల్."

"బావా, యిూ 'సీగ్రరట్టు' సీక్రెట్గా తెల్సింది"

"పుస్సేనుకు నాలుగు నుక్కల అమురుతం పోయిస్తుంటేనికదా. ఆట్నె పెగ్గ ఆమె సిగ్రరట్టన్ని పేపి రికార్డులా యినిపిస్తడు."

"భలే అసాధ్యుడివి. అయితే ఆ విషయం ముందె ఏడవొచ్చుగ. మ్యూడోజులుగా స్టూడియో కిరాయిలు మిగిలేవి."

"సియవ్వ. గరతాచారమని పదిలిగ్గా సెపితే రేపియ్యాల్టికి పిచ్చర్ పేపర్కన్నీ గబ్బుగొట్టవ్."

"వూఁ- అంతా మన ఖర్మ... యిూ సినిమా వ్యాపారం కంటె దొంగ జంధ్యం వేసుకొని దినవారాలు పెట్టుకుంటే బావుండేది."

"మన పిచ్చర్ డబ్బులుగావి తిరిగొస్తె మన దినవారాలు మనమే అడ్వాన్సుగా పెట్టుకోని సావాలి."

ఆపాటికి సుట్టకాస్తా ఆరిపోయింది. అప్పటికే మూడగ్గి పుల్లలు కాల్చేసిన బొడ్డులింగం మరో అగ్గిపుల్లను వేస్టు చేయ దల్చుకోలేక ఆ చుట్టను చిరాగ్గా నోట్లోంచి తీసి చేత పట్టుకున్నాడు.

"నియ్యవ్వ... సుట్టుముండా... ప్రొడ్యూసరంటే నీక్కూడా పులకనేటే. వీటికోసారారిపోతే నానేం బుద్ధి తక్కువోణ్ణనుకుంటివా, మళ్లిమళ్లి ముట్టియ్యా

డానికి" అని సగంకూడా కాలని చుట్టని తీసి ఖరీదైన 'ఆష్ట్రే'లో పడేసాడు.

ఇంతలో టిఫినొచ్చింది.

"ఉరేయ్ శాత్రీ (శాస్త్రి కొచ్చిన ఖర్మ) నువ్వేదో కొత్త రకం ఆంలెట్ చేస్త వంటివే–" అన్నాడు ప్లేటువంకచూస్తూ.

"అవున్సార్– యివ్వాళ్ల ఫ్యూరీలోకి అదే చేసాను నోట్లో వేసుకుంటె కరిగి పోద్ది."

"నా యాపారంవే దివాలాగుంది. నోట్లో వేసుకుంటే కరిగిపోయే దాంతో ఆకలారుద్దా శాత్రీ" అంటూనే గుటక లేసుకుంటూ టిఫిన్ ముగించాడు బోడ్డు లింగం...

అవతల కారు రెడీగా ఉన్నట్టు హారన్ "పాఁవ్...పాఁవ్" అని మోగింది.

"రామలింగం ఆ కురుపుగాణ్ని చరుపు చరువు. అసలే కారుకు సెలవులేదు. ఆ బ్యాట్రీ నెందుకు అలా తగిలేస్తాడు" ('కురూప్' పేరుకొచ్చిన గ్రహణం అది).

"బావా– కరెక్టు టైముకు నువ్వేగా హారన్ వాయించ మన్నావ్"

"వాయించమంటే ఆపట్న వాయించ డఁవేనేంటి"

రామలింగం కూడా ఆదరా బాదరా టిఫిన్ తినేసి బయట పడ్డాడు.

అద్దంలో మరోసారి గుబురు మీసాల్ని దువ్వుకుని బయటి కొచ్చాడు బొడ్డులింగం

బామ్మర్ది ముందే వెళ్ళి అద్దెకార్లో కూర్చున్నాడు.

"సార్ కాస్త లొయ్యండి, యీ ముండా కారు కాస్తా గారేజీనుంచి బయటికొచ్చేసరికి అలసి పోయింది.–" డ్రైవర్ కురూప్ గొణిగాడు. రామలింగం మాత్రం కారు దిగలేదు.

"ఖర్మ–యీకారుకు కూడా స్టార్టింగ్ టబులుందీ" అంటూ దోతివెంగు పైకెగ్గట్టి లోసాడు బొడ్డులింగం. చెమట లొచ్చాక గాని అది స్టార్టుకాలేదు.

"నియ్యవ్వ పైరంగు చూస్తే మిలమిల్లాడు తున్నది. బోనెట కింద ఇంజన్ బదులు రేకుడబ్బాలు పెట్టినట్టుందే బామ్మర్దీ, యీపట్నం సరుకంతా గింతేనేంది పైన పటారం, లోనలొటారం..."

"అంతేకాక..." బామ్మర్ది వంతపాడాడు.

ఎలాగైతే నేం కారు స్టూడియో చేరుకుంది అప్పటికే పది కావొస్తుంది. గేటు దగ్గర వాచ్‌మెన్ సలాంచేసాడు.

"నియ్యవ్వ... బామ్మర్దీ... యీ పుల్లయ్య కెంత యిదనుకున్నవ్ నేనంటె... ఎప్పుడొచ్చినా వంగొంగి సలాం చేస్తుంటడు" ('సిక్లా' పేరుకొచ్చిన అగచాట్లు)

బామ్మర్దికి సంగతి పట్టలేదు. 'హీరోయినొచ్చిందా రాలేదా, వస్తే టాపు హిట్టయ్యే పాట పిచ్చరైజ్ అవుతుంది ఈ రోజు...' అనే ఆలోచనలో వున్నాడు.

కారు దిగాక అక్కడక్కడ సలాంలందు కుంటూ యిద్దరూ ఫ్లోర్ చేరుకున్నారు.

ఆ రోజు పల్లెటూరి సీను షూట్ చేయాల్సి వుంది. హీరోయిన్ పిడకలు చేస్తూంటుంది. విలన్ ఆమెను చూస్తూ పాట పాడుతుంటాడు. పాటయ్యాక కన్ను గీటుతాడు. హీరోయిన్‌కు వళ్ళు మండి పేడతీసుకుని విలన్ మొఖాన కొడుతుంది. అది కాస్త గురి తప్పాలనే తప్పి విలన్ చొక్కామీద పడుతుంది. అంతటితో కట్...

అప్పటికే సీన్ తయార్‌గా వుంది. అప్పటికే ఆవూ దూడా... ఆవు ముందు గడ్డి... ఆవు గడ్డి మేస్తూ వుంటుంది. దూడ పాలు తాగుతూ వుంటుంది.

అనుకున్న సమయానికి అరగంట ఆలస్యంగా హీరోయిన్ వచ్చింది, తల్లినెంటేసుకుని. విలన్ కొత్త మొఖం కనుక కరెక్టు టైమ్‌కే వచ్చాడు.

రికార్డు పెట్టేసి 'స్టార్ట్' అవడానికి ముందు డైరెక్టర్ హీరోయిన్ను పేడ

కలపమన్నారు. ఆయనకంతా నాచురల్‌గా వుండాలి.

''నాకు పేడంటే అసహ్యం. దాని వాసనంటేనే డోకు'' అన్నది హీరోయిన్...

''డూపంటే నాకూ వస్తుంది డోకు'' డైరెక్టర్ గుర్రుమన్నాడు.

హీరోయిన్ తల్లికి కూడా ఆ సీన్ చూసేసరికి కోపంవొచ్చింది.

''ఏవయ్యా, బొడ్డాసరా— వింత యాక్షనయితేసూ తం మా బొట్టితో పిడకలు చేయిస్తావూ, నీదుడ్డా సువ్వా



తగలడ'' అంది హీరోయిన్ తల్లి బుస్సుమంటూ...

హీరోయిన్ తల్లి తొడగిచ్చి...''ష్ అమ్మా— అడిగినంత యిచ్చాడు కదా సగం తెలుపూ సగం నలుపూ, నోరెత్తామంటే కోపంవొచ్చి పీక నొక్కేస్తాడు... ఆసరే పల్లెటూరి బైతు'' అంది...

దూరంనుంచి యీమాటలు సరిగ్గా వినని బొడ్డులింగం గొంతులో వినయంరంగరించుకుని ''ఏంటమ్మా— ఏంకావాలి ?'' అన్నాడు

''ఓ చెంబుడు కాఫీ తెప్పించండి'' అంది హీరోయిన్.

''చెంబుడేం ఖర్మ, బిందెడు తెప్పిస్తాను. ఒరేయ్ జాకపూ వో యాదైకసప్పలకాఫీ''

# పిడకల వేట

అంటూ బాయ్‌ని కేకేసాడు. ('జాకబ్'' పేరుకొచ్చిన తంటా అంది.)

బాయ్‌ని కాఫీని పురమాయించి ''అమ్మడూ, నువ్వు కాస్త పేడకలపడం మొదలెట్టమ్మా—సెట్టంతా రెడీ అయింది'' అన్నాడు.

''నా కసయ్యం నేను కలపను''

''ఫర్వాలేధమ్మా, సహజంగా ఉండాలి కదా— పైగా కలర్ పిచ్చర్ గూడాను.

''ఉహూ''

బొడ్డులింగం ఇక లాభంలేదనుకుని నెమ్మదిగా డైరక్టర్ దగ్గరికి వెళ్ళి ''ఏవయ్యా, డైరక్టేరూ, నువ్వయినా చెప్పు పిడకలు చేయకుండా ఎలాగయ్యా చేసినట్టు చూపడం''

బావుండదని, డైరక్టర్ కూడా వకాల్తా పుచ్చుకున్నాడు. లాభంలేక పోయింది.

ఇక ఏదో వో ఉపాయం ఆలోచించాలని —''వో కిలో గోధుమపిండి తెప్పించండి'' అని బొడ్డులింగాన్ని పురమాయించాడు.

''ఎందుకూ, యీహీరోయిన్ కాకలేసి పూరీలు చేయించమందా'' బొడ్డులింగం బుర్ర వేడెక్కింది.

''అబ్బబ్బ, తెప్పించండీ మీకుతెలియదు గానీ, యీ కొత్త బొడ్డాసర్తో యిదె గొడవ'' విసుక్కున్నాడు.

''రామలింగం, విన్నావుగా అదేదో చూడు''— ఏవయ్యా, డైరకటేరూ గోధుమపిండొచ్చిందాకానూటింగ్ మొదలెట్టనట్టేనా.''

''అక్కరాలా...'' అంటూ నే స్క్రిప్ తిరగేయసాగాడు:

పదినిమిషాల తర్వాత రామలింగం కిలో గోధుమపిండి తీసుకొచ్చాడు

''బావా, కిలో పిండికి పదిరూపాయలు'' అన్నాడు ఏడుపు ముఖంతో

''అదేవిటి, అంతరేటు. మొన్నటి తుఫాన్లో దేశంలోని గోధుమ పిండంతా కొట్టుకుపోయిందా''

'దగ్గర్లో కొట్లేవీ లేవట స్టూడియో క్యాంటిన్‌లో వుంటే తెప్పించాను పూరీల గిరాకీ పోతుందన్నాడు (బతిమిలాడి సిటీకి రానుపోను టాక్సీ చార్జీలు కట్టిస్తే కిలో పిండి యిచ్చాడు వాడు''

''ఖర్మ... తీసుకెళి ఆ డైరకటేరు ముఖాన పొయ్యి'' అన్నాడు నెమ్మదిగా.

డైరక్టర్ చెప్పడంతో గోధుమపిండిలో ఆకుపచ్చరంగు కలిపి ముద్దచేసి హీరోయిన్ చేతులకింత పూసాడు మేకప్ మాన్

''అలా పూస్తావేం పుండ్లకు మందు పూసినట్టు. ఇలాతే పిక్చర్లో సరిగ్గా కనిపించాలంటే ఇంత నాజూగ్గా పూస్తే కుదర్దు'' అంటూ బామ్మర్ది రామలింగం పిండి తీసుకుని మనసుతీరా హీరోయిన్ చేతుల నిండా పూసాడు.

డైరకటేరు తెలివితేటలకూ, బామ్మర్ది ధైర్యానికీ బొడ్డులింగం బొడ్డదరనవ్వాడు.

''డైరక్టేరూ, యింక మొదలెడదామా.''

''ఆగండాగండి .. ఎవర్నైనా ముందా పేడా పొట్టూ కలిపేసి వో పది పిడకలు చేసి పెట్టమనండి.''

''అదేదో నువ్వే న్యూడదూ ''

''మెటిరియల్స్ సప్లై చేయడం మీ ధర్మం'' డైరక్టర్ బుస్సుమన్నాడు

''కాదు, ఖర్మం... బామ్మర్దీ— యీ డెవరన్నా పిడకలుచేసే వాళ్ళున్నారేమో చూడు.''

''బావా, అకస్మాత్తుగా కావాలంటే ఎలా— ఉండు.'' అని బయటికి పరుగు



# నాకు తెలుసుగా గ్లైకోడిన్ నమ్మకమైనదని-

## ఆమె దగ్గుకు ఇట్టే ఉపశమనాన్ని కలిగిస్తుందని...






**భారతదేశంలో దగ్గులను నివారించే యితర మందులకన్న, గ్లైకోడిన్ ఎందరికో దగ్గునుండి ఉపశమనాన్ని కలిగించింది.**

**అందుకే ఇది ప్రథమశ్రేణికి చెందినది.**

ఇది దగ్గు బాధించే అన్ని భాగాలలోనూ త్వరగా పనిచేసి త్వరితమైన, ఖచ్చితమైన ఉపశమనాన్ని యిస్తుంది.

- గొంతు మంటను తగ్గిస్తుంది.
- కఫమును తొలగించి జలుబు వల్ల వచ్చే దగ్గుల నుండి ఉపశమనాన్ని యిస్తుంది.
- సుఖ నిద్రను కలిగించి, ఛాతీలో కండరాల బిగువును తగ్గించి సులభంగా శ్వాస పీల్చేందుకు తోడ్పడుతుంది.

దగ్గు ఎలాంటిదైనాసరే—పూర్తిగా అదుపులోకి తెచ్చేందుకు మంచి రుచికరమైన గ్లైకోడిన్‌పై మీరు ఆధారపడవచ్చు




గ్లైకోడిన్—దగ్గులను కొట్టిపడవేయు భారతదేశపు ఛాంపియన్—విశ్వసనీయమైన మందులను తయారుచేసే అలెంబిక్ సంస్థ ఉత్పాదన.

everest/519/ACW-19




తీసాడు. మరో పావుగంటకు వో అమ్మాయిని తీసుకొచ్చాడు రామలింగం.

"బావా యీ పిల్లకు వంద రూపాయలిస్తేగానీ పిడకలు చేయదట"

"ఏమిటీ, పిడకలు చెయ్యడానికి వందా, దాని బొంద- అక్కర్లేదు పొమ్మను-" బొడ్డులింగానికి బొడ్డులోంచి కోపం వచ్చింది.

ఆ అమ్మాయి లేడిపిల్లలా ఎగురుతూ వెళ్ళిపోయింది.

"డైరక్టరుగారూ, ఎంత కష్టం తెచ్చిపెట్టావయ్యా మరెవర్నయినా చూడు"

"ఇక్కడెవరన్నా ఉన్నారా" అన్నాడు డైరక్టర్

ఎవరూ ముందుకు రాలేదు.

అప్పటికి బిందెడు కాఫీ యింకా రాకపోవడంవల్ల హీరోయిన్ తల్లికి టెంపరేచర్ పెరిగిపోయింది కాబోలు- "ఎవరొస్తారు బొడ్డూసరూ, దుడ్డు పెట్టలేనోడివి నువ్వే అవని చెయ్యరాదూ" అన్నది

అక్కడున్న వాళ్ళంతా నవ్వారు. నవ్వని దల్లా బొడ్డూసరూ, సదరు బామ్మర్దీను...

"ఏమిటి, చేయరాదను కున్నారేంటి-" అంటూనే సిల్కులాల్చీ చేతులు పైకి మడచి ధోతి చెంగులు పైకి చెక్కి పేడా పొట్టూ కలిపి అటూ యిటూగా రెండు పిడకలు చేసి

# పిడకల వేట

కోపంగా పక్కన పెట్టబోయి పక్కనవున్న బకెట్‌లోని నీళ్ళన్నీ వొలక బోసాడు. పేడంతా నీళ్ళమయం అయింది కళ్ళాపి తయారైంది. బొడ్డూసర్ కెటూ పాలుపోలేదు

"ఏమయ్యా, డైరక్టరూ- ఇప్పుడేం చేద్దాం"

"పిడకలు చేసారుగా యీ కొత్త బొడ్యూసర్గారితో వచ్చిన చావేయిది ఇప్పుడు పేడకావాలే, ఎక్కణ్ణుంచి తెద్దాం"

"బావా, యీ జబ్బేడు పేడకు పదిహేను రూపాయలు తీసుకున్నాడు ఇప్పుడు అర్జంటుగా కావాలంటే ఎక్కణ్ణుంచి దొరుకుతుంది" మధ్యలోనే సదరు బామ్మర్ది వ్యాఖ్యానించాడు.

"డైరక్టరూ, సీనుమార్చేయండి"

"సీనా, మార్చేయాలా... పిడకలు కొట్టడానికి పాటకూ లంకె పెట్టి "కొట్టూ కొట్టూ- కొట్టూ కొట్టూ" అనే పాట కోసం ఆ కవిగాణ్ణి చంపుకుతిని, పాటంతా రాయించి యిప్పుడు సీను మార్చాలా ... వీల్లేదు వీల్లేదంటే వీల్లేదు."

"కొట్టు కోవాల్సింది నెత్తి ఎలా" బొడ్డులింగం విచారించాడు.

హీరోయిన్. ఆవిడ తల్లీ అప్పటికే వచ్చిన బిందెడు కాఫీలో ఎన్ని కప్పుల కాఫీ ఉంది లెక్కెడుతున్నారు

"ఆవు నడ్డిమీద ఒక్క టెయ్యండి - పేడేస్తుంది" -ఎవరో అన్నారు.

బొడ్డులింగం తలెత్తి చూసాడు ఆ మాటలన్న దెవరోకాదు, విలన్...

"అబ్బ నా పిచ్చర్‌కు డూప్ అవసరం లేకుండా దొరికింది యీ యిలనొక్కడే" అన్నాడు.

మళ్ళీ నవ్వులు... ఒకటే నవ్వులు...

"బామ్మర్దీ, వో జబ్బేడు పేడదొరికే ఉపాయం చూడరాదూ"

తిరిగి రామలింగం బయటికి వెళ్ళాడు. పావుగంట తరువాత తిరిగొచ్చాడు

"బావా, జబ్బేడు పేడకు యాభై రూపాయలట"

'బావ'కు కళ్ళు తిరిగినట్లైంది ... కిలో పిండికి పదిరూపాయలు.. జబ్బేడు పేడకు పదిహేను రూపాయలు... పిడకలు చేస్తే వంద... భగవంతుడా, యీ రేటు అన్ని చోట్లా యిలాగే వుంటే పల్లెటూళ్ళో బానెడు గోచికి నోచుకోని వాళ్ళోళ్ళంతా పేడలు కట్టారూ... ప్... కలిహాయు ... అంతకంటే ఏంలేదు..." అనుకున్నాడు

"సరే, తప్పేట్టు లేదు యీ రేటులో కూడా దగ్గర పల్లెటూరుకి రానుపోను టాక్సీ చార్జీలు కలిసినట్టుంది తీసుకురా"

మరో పదినిముషాల్లో యాభై రూపాయలిచ్చి ఆ జబ్బేడు పేడ తెచ్చాడు రామలింగం.

ఎలాగోలా మూడు గంటలు ఆలస్యంగా అనుకున్న పాటమీద షాట్ పూర్తయింది

బొడ్డులింగంకారు తోపాకస్టార్టయింది

"బావా, ఎలాగైనా అనుకున్న పని ఐపోయింది" అన్నాడు సంతోషంగా బామ్మర్ది

"నియ్యవ్వ ఈ రోజు షూటింగ్ కావడానికి పిడకలు కూడా చేయాల్సొచ్చింది. ఈ సినిమా అంతా అయ్యేలోగా ఇంకెన్ని ఏషాలెయ్యాలో ఏమో" అంటూ ముందు సీటో కూలబడ్డాడు బొడ్డులింగం.

కురుపు నీలుగుతూ తోలుతుంటే కారు మూలుగుతూ ముందుకు సాగింది



చిన్న సీరియల్

# హిమబిందు

జొన్నలగడ్డ లలితాదేవి

(గత సంచిక తరువాయి)

హిమబిందున్న రైలు స్టేషన్ విడిచి వెళ్ళిపోయింది. మాధవి బాస్కెట్‌లో అర డజను బత్తాయి పళ్ళు తీసుకుని ప్రవేశించింది

ఆమెని చూస్తూనే వికసించిన ముఖంతో ఆనందం వెల్లువకాగా "మాధవి" అంటూ చేతులు జాపాడు శ్రీపతి మరేమీ సంశయించకుండా ఆ చేతుల్లో వాలిపోయింది మాధవి. అలా వారిన ఆమెని ఎంతో ఆర్తిగా మరెంతో తపనగా గుండెల్లో పొదువుకున్నాడు శ్రీపతి. మాధవి కౌగిలిలో స్వర్గమే దిగివచ్చిందనుకున్నాడు శ్రీపతి. మండుటెండలోని పిపాసారునికి చల్లని మంచినీరు అందించే చలివేందరంలా, తిరిగి తిరిగి అలసిపోయి కాళ్ళు లాగి శరీరం అవశమై, నిస్సత్తువగా కూలబడిపోయే సమయంలో అన్వేషించే గృహప్రాంగణం ఎదురుగా వచ్చి నిలిచి ఆహ్వానపూర్వకంగా ద్వారాలు తెరచినట్టు, మండిపోయే మనసుకు చల్లని మంచి గంధం అద్దుతున్నట్లయింది

సున్నితమైన ఆమె చేతులు తననిచుట్టివేసి గాఢంగా లతలా అల్లుకుపోగా ఎంతో స్వాంతన, మరెంతో ఉపశమనం కలిగాయి. ఆరెండు బుగ్గలూ కందిపోయేలా పదే పదే ముద్దుల వర్షం కురిపించాడు.

"మాధవీ: హిమ నాతో తెగ్రతెంపులు చేసుకుంది. ఇంక జన్మలో ఆమెకి నాముఖం నాకు ఆమె ముఖం చూసే అవకాశం, అవసరం కూడా లేవు శ్రీపతి ఇప్పుడు మాధవి కరాంగుళులలో బంధితుడు ఆమె అనురాగ వల్లరిలో తన్మయుడయ్యే ధన్యజీవి"

"ధన్యురాల్ని మనం రెండు రోజుల్లో పెళ్ళి చేసుకోవాలి."

"చేసుకుందాం: కుంటివాడితో జీవితాన్ని ముడిపెట్టుకోబోయే ముందు మరొక్కసారి ఆలోచించుకో."

"ఇన్నిసార్లు ఆలోచించి బుర్ర బద్దలు కొట్టుకోవాల్సిన పనేమీ లేదు హిమతో మీరు విడాకులు పొందితే పెళ్ళి చేసుకోవాలని నేను ఏనాడో నిశ్చయించుకున్నాను"

"కాని ఆతర్వాత బాధ పడలావేమో."

"బాధా లెదు ఏమీలేదు. నేనుమీహోదాని ఐశ్వర్యాన్ని చూసి ప్రేమించలేదు అనాడు. అంచేత ఈనాడు లవి లేవు గనుక ప్రేమకు అవరోధా లవుతాయనుకునె పని లేదు మనం హాయిగా వుందాం. నేను ఉద్యోగంచేసి మిమ్మల్ని కంటికి రెప్పలా చూసుకుంటాను. ఏ విధంగానూ కొరత చేయను"

"నాదగ్గర కొంత డబ్బు వుంది మధూ: అది నాపేరుతోనే వుందిబొత్తిగా నిర్ధనుడిని కానులే!"

"మరింకేం! ఏదన్నా చిన్న బిజినెస్ పెట్టండి. మీకూ కాలక్షేపంగా వుంటుంది. నేనెలాగో ఉద్యోగం చేస్తూనే వున్నాను. మీరాబడి రావాలి తినాలి అనే పట్టింపు లేదు." అంది ఉత్సాహంగా.

చివరికి తమ దగ్గర ఉన్న డబ్బుకు కొంత లోన్ తీసుకుంటే పెద్దది పెట్టుకోవచ్చని పించినా ముందు రెడీ మెడ్ బట్టల కొట్టు తెరిస్తే బాగుంటుందని నిశ్చయించారు.

శ్రీపతి ఎదలోని నీలి నీడలన్నీ మాయమయ్యాయి. భయజీమూతాలన్నీ తొలగిపోయాయి ఏదో ధైర్యం, మరెంతో ఉత్సాహం, కాళ్ళు లేకపోతేనేం బ్రతకగలను అన్న ఆత్మవిశ్వాసం పోయిన పెన్నిధి లభించిందని మాధవిని చూసి మురిసి పోయాడు. మరో వారానికల్లా 'మాధవి భర్త అయిపోయాడు శ్రీపతి.

## 6

హిమబిందు చాలా అందమైందని సురేంద్రనాథ్ చెప్పాడు గాని ఇంత అందమైందని వూహించలేదు. మెట్రోపాలిటన్



మిల్సు మేనేజింగ్ డైరక్టర్ మణిలాల్ మెహతా. అబ్బ! ఏం అందం: బ్యూటీక్వీన్ అనదగ్గవారు, ఇక్కడి సినిమా స్టార్లు అంతా ఈమె ముందు పదిమైళ్ళదూరంలో నిలబడాలి ఇలాంటి ఆమె తన పి.ఏ'' అనుకుంటూ ఆనందంతో బొంబాయి సముద్రంలానే అయిపోయాడు మెహతా. ఇంత గొప్ప సౌ దర్యవతిని తనకి రికమెండ్ చేసినందుకు సురేంద్రనాథ్‌కి మనస్సులోనే కృతజ్ఞతలు తెలుపుకున్నాడు.

తన అందంతో మెహతా మనస్సును ఆకట్టుకుని అతని హృదయంలో పీఠం వేసుకోవడానికి హిమబిందుకు అట్టేరోజులు పట్టలేదు నెల తిరిగేసరికి సినిమాలు, షికార్లు, షాపింగులలోకి దిగిపోయింది వ్యవహారం హిమబిందు అలంకరణల్లో, ముస్తాబుల్లో పూర్తిగా మతిపోగొట్టుకున్న మెహతా

ఆమెని పెళ్ళాడి తీరాలన్న నిర్ణయానికి వచ్చాడు. రోగి పాలే కోరాడు, వైద్యుడూ పాలే చెప్పాడన్నట్టు అతని బ్యాంక్ బ్యాలన్స్, అతని కారు అన్నీ చూసి మైమరచిపోతున్న హిమబిందు అతని ప్రపోజల్ అంగీకరించింది. మెహతా కూడా అందగాడేనని చెప్పాలి. పైగా ఆ మిల్స్‌కి మేనేజింగ్ డైరక్టరు అతనే: ఇంక చెప్పేదేముంది!

ఆ రోజు హిమబిందు వచ్చేసరికి ''మెహతా డౌన్‌డౌన్ సుయేధ్ డౌన్‌డౌన్'' అంటూ నినాదాలు. మిల్లులో పనిచేసే వారంతా నిరవధికంగా సమ్మె చేస్తున్నారు. జీతాలు పెంచమని బోనసులు పెంచాలనీ'' ఎవరూ పనిచేయడం లేదు. నిరంతరం మిషన్ల శబ్దాలతో పరివృతమయిన లోపలంతా నిద్ర

***జరిగినకథ 4*** జనరల్ మేనేజర్ శ్రీపతి పి. ఏ. గ చేరిన హిమబిందు అందం ఆ ఆఫీసులో అలజడి రేపుతుంది డబ్బు, హోదా, అధికారం ఉన్నప్పుడు శ్రీపతి ఆమెని ఆకర్షిస్తాడు. హిమబిందు శ్రీపతి పెళ్ళి చేసుకుంటారు. కారు ప్రమాదంలో కాళ్ళు, ఉద్యోగం అన్నీ పోగొట్టుకున్న శ్రీపతి అంటే అసహ్యం, ఏవగింపు కల్గుతాయి హిమబిందుకి. మరో ఉద్యోగం దొరకడంతో శ్రీపతితో తెగతెంపులు చేసుకుని వెళ్ళిపోతుంది.




పోతున్నట్లున్నాయి గదులు.

హిమబిందు మైక్ దగ్గర నిలబడి మెల్లగానచ్చ చెప్పింది. ఏదైనా సమస్యలని శాంతియుతంగానే పరిష్కరించుకోవాలని సమ్మెలవల్ల కొట్లాటలవల్ల ఏదీ నెరవేరదని

ఎవరూ వినిపించుకోలేదు క్రిందటేడు నష్టం వచ్చిందని బోనస్ సరిగ్గా ఇవ్వలేదని జీతాలు పెంచలేదని, ఈఏడూ అదేపాట పాడుతున్నారని, నష్టం ఎక్కడ వస్తోందో తేల్చిచెప్పాలని, లెక్కలు చూపించాలని అంటూ విపరీతంగా గొడవ చేయసాగారు. ఎవరూ మాట వినేటట్లు లేరని సరాసరివెళ్ళి మెహతాతో చెప్పి చూసింది

నిజానికి వర్కర్ల అభియోగం సరైనదే: మెహతా రెండేళ్ళనించి ఎవరికీ జీతాలు పెంచలేదు. దానికి కారణం లేకపోలేదు. అతను కలకత్తాలో మరో పెద్దకంపెనీ ఏర్పాటు చేసే విషయంలో చాలా డబ్బు వ్యయం చేస్తున్నాడు.

విధిలేక మెహతా బయటకు వచ్చాడు. వచ్చేఏడు తప్పకుండా పెంచుతానని, ఈ ఏడు ఎడ్జెస్ట్‌మెంట్ కుదరదని, దయచేసి పనిలో చేరమని హెచ్చరించాడు. కొందరు మెత్తబడ్డారు. మరికొందరు వూరుకోలేదు సరిగదా మరింతగా విజృంభించారు. సోడాబుడ్లు గిరాటు వేసుకోవడం, యాసిడ్ సీసాలు విసిరేయడం వరకు దిగజారడంతో మెహతాయే ఆ పరిస్థితికి జంకాడు. హిమబిందు కసలే ముచ్చెమటలు పోసుకురాగా. గబ గబా పోలీసులకి ఫోన్ చేసి బయటకు వచ్చింది. మెహతాని కదలనీయ

# స్టేన్స్‌టైర్

# సమస్యలను పరిష్కరిస్తుంది



స్టేన్స్ టైర్ రీట్రెడ్‌లు సురక్షితమైనవి. ప్రఖ్యాతి గాంచిన టైరసోల్స్ సాంకేతిక పరిజ్ఞానాన్ని స్టేన్స్‌టైర్ వినియోగించు కుంటుంది. మీ టైరు ఎక్కువకాలం పనిచేసేటట్లు గ్యారంటీ ఇస్తుంది.

స్టేన్స్ టైర్ ఎక్కువ ఆదాచేస్తుంది. ప్రతి కేసింగ్‌కు ఎక్కువ రీట్రెడ్‌లు చేయవచ్చు— కాగా లాభకరమైన అంశం. ప్రతి కిలో మీటరును లెక్కకడితే ఖర్చు అతితక్కువ కాగలదు. ముఖ్యమైన కేంద్రాలలో వున్న స్టేన్స్ టైర్ ఫ్యాక్టరీలు వెంటనే సేవచేయడంలో గణతి కెక్కినవి.

**STANESTYRE**

**స్టేన్స్‌టైర్**

**అండ్ రబ్బర్ ప్రొడక్ట్స్ లిమిటెడ్**

**తిరుచి రోడ్, కోయంబత్తూరు**

**ఫ్యాక్టరీలుగల ఇతర కేంద్రాలు:** మద్రాసు. వెల్లూరు, తిరుచి, సేలం, మధురై, ట్యూటికోరన్, బెంగుళూరు, మెంగుళూరు, విజయవాడ, సికింద్రాబాద్, ఎర్నాకుళం, కొట్టాయం, కాలికట్, తిరుపూరు.

MAC (B) ST-1/77 (R)







కుండా/ చుట్టు ముట్టున్నారు కొందరు. ఆ గుంపులో ఒకడు గురిచూసి యాసిడ్ సీసా మెహతా మీదకు విసిరేశాడు. అది చూసిన హిమబిందు అదిరిపడి అనాలోచితం గానే మెహతాకి అడ్డు వచ్చింది. యాసిడ్ అందమ్మైన హిమబిందు ముఖంపై పడి భగ్గుమని పించింది. హిమబిందు కెవ్వుమని అరిచేసరికి హడలిపోయిన మెహతా ఆ దగ్గరున్న వారు ఆమెని చుట్టుముట్టే లోగా బయట పోలీస్ వ్యాన్ ఆగింది. హిమబిందు హాస్పిటల్లో ఎడ్మిట్ చేయబడింది. ఫ్యాక్టరీ లాకౌట్ చేశేశారు.

వారం రోజులకి హిమబిందు, ఆస్పత్రి నించి విడుదలై ఇంటికి వెళ్ళింది. ముఖం అంతా వికృతమై, అందమంతా సర్వనాశనమై కురూపిలా తయారైన హిమబిందును ఆస్పత్రిలో కట్లు విప్పినప్పుడు చూడగానే మెహతా వళ్ళు జలదరించింది.

వెనకటిలా నవ్వుతూ తుళ్ళుతూ, సౌందర్య గర్వంతో మిడిసిపడే హిమబిందు కాదు. సర్వమూ కోల్పోయి, గర్వాహంకారాలకు పెద్ద పెట్టున ఎదురుదెబ్బ తగలగా కేవలం జీవచ్ఛవంలా వున్న ఇరవై అయిదేళ్ళ వనిత హిమబిందు. దెబ్బ తిన్నాక పోలీసులు లాఠీఛార్జి జరిపారు. మెహతా లాకౌట్ ప్రకటించాడు. రెండు రోజుల్లోనే రాజీకి వచ్చారు కార్మికులు. యూనియన్ ద్వారా ఒప్పందం కుదిరింది. మళ్ళీ తెరువబడింది. హిమ తిరిగి ఆఫీసుకి వచ్చేసరికి వాతావరణం ఏమీ జరగనట్టే అతి ప్రశాంతంగా వుంది. అనాకారిగా మారిన హిమబిందు మనసిచ్చి మాట్లాడలేక పోతున్నాడు మెహతా. అతనిలోని ఆ

## పి. ఏ. హిమబిందు

మార్పుకు కారణం గ్రహించిన హిమబిందు కళ్ళల్లో నీళ్ళు తిరిగాయి. తన గదిలో ఆమె తన పని తాను చేసుకుంటున్నా ఆమెని చూసి భరించలేక పోతున్నాడు మెహతా. అతనామె అందం చూసే మోజు పడ్డాడు. అది హిమంలానే కరిగిపోయింది. ఇంకక్కడ ఏం మిగిలింది ?

ఆరునెల్ల జీతం ఇస్తూ "హిమా; నేను నీ అందాన్ని చూసి ముచ్చటపడి పెళ్ళి చేసుకోవాలనుకున్న మాట వాస్తవమే! ఈనాడు నువ్వెంత వికృతంగా మారి పోయావో నీకే తెలుసు. ఒకవిధంగా యిది మన పెళ్ళికిముందే జరిగినందుకు మంచిదే అయిందేమో! నేను నిన్ను ఏ మాత్రమూ పెళ్ళాడి భార్యగా స్వీకరించలేను. అందుకు నువ్వేమీ అనుకోకు." అన్నాడు స్థిరంగా.

హిమబిందు నిరాశగా నవ్వింది. "అనుకోవడానికేముందిలెండి. నిజానికి నేను మీ భార్యగా వుండటానికి ఏమాత్రమూ తగను. ఆ విషయం నేనే చెప్పాలనుకుంటున్నాను." అంది నిబ్బరంగా. ఉద్యోగంనుంచి తొలగించినందుకే ఆర్నెల్ల జీతమూ యిచ్చాడని గ్రహించింది.

మెహతా చాలా సంతోషించాడు. హిమ ఏమీ పేచీ పెట్టనందుకు. ఆ రాత్రి ఇంటికి వెళ్ళిపోయిన ఆమె కన్నులముందు శ్రీపతి గిరగిరా తిరిగాడు. అతను గుర్తురాగానే కళ్ళు అశ్రుపూరితాలయ్యాయి.

మెహతా ! ఎంత చిటికలో తేల్చివేశాడు. విశ్వాసఘాతకుడు. అతనికి అడ్డం వెళ బట్టేగా తనకీ దౌర్భాగ్యం పట్టింది! తనాతన్ని రక్షించకుండా వుంటే ఈ స్థితిలో తనే వుండేవాడు. రోగం చప్పగా కుదిరి పోయేది." అనుకుంది కసిగా. మళ్ళీ వెంటనే దుఃఖం ముంచుకు వచ్చింది. ఒకర్ని అనుకుని లాభం ఏమిటి? తను చేసిన తప్పుకు శిక్ష అనుభవించాలి. దైవికంగా జరిగిన పొరపాటుకు శ్రీపతితో సరిపుచ్చుకో లేకపోయింది. అతన్ని ఈసడించింది. తృణీకరించింది. అందుకు తగిన విధంగా శిక్షించాడు దేవుడు.

ఆదరణ, అప్యాయత లేకుంటే మనిషి గుండెలెంత మండిపోతాయో ఈనాటికి తనకి అనుభవ పూర్వకంగా తెలిసింది. అంతేనా? తన దూషణ తిరస్కారాలవల్ల శ్రీపతి హృదయం ఎంత గాయపడిందో కూడా అర్థమైంది. చిన్నప్పట్నించీ వస్తున్న తన అందంపట్ల వ్యామోహం ఒక్క దెబ్బతో ఎగిరిపోయింది. అందమంతా వెండి మబ్బులని భ్రమపడిన తనకి వెండి కరిగి మబ్బు మిగిలి చివరకదికూడా గాలిలో తేలిపోతూనే వుంది. ఇంక తనీ వికృత రూపంతో జీవించలేదు. మరణించినా, రాజా రారాజే అన్నట్టు తన వూహల వుయ్యాల తెగిపోయినా, తన ఆశలు, అభిప్రాయాలు అన్నీ మట్టిలో కలిసిపోయినా తన ఆభిజాత్యాన్ని తనెంత మాత్రము వదులుకోకూడదు. ఒకరిచేత హేళన చేయబడుతూ, అర్థంలేని సానుభూతి, వింటూ మొండిగా బ్రతికేకంటే తనకి ప్రాణాధికమైన సౌందర్యం కోసం ప్రాణ త్యాగం

(38 వ పేజీ చూడండి)

ఆస్థాన కవితో ముఖాముఖీ

# 'పద్యం మన వెయ్యేళ్ల పంట!'

-డా॥ దాశరథి

డా. దాశరథి గారు ఆస్థాన కవి కాగానే ఆంధ్రలో కొన్ని సాంస్కృతిక సంస్థలు సాహితీ సంస్థలు ఆయన్ని పిలిచి సన్మానిస్తున్నప్పుడు అక్టోబర్ చివరి వారంలో విజయవాడలో కొంతసేపు ఆయన మకాం చేసినప్పుడు వీరాజీ జరిపిన యిష్టాగోష్ఠిని ప్రశ్నోత్తరాల రూపంలో యిక్కడ యిస్తున్నాము.

ప్రశ్న : ఆస్థాన కవి నవ్వాలని మీరు ఏ దశలోనైనా ఉవ్విళ్లూరేరా ? ఈ పదవి వచ్చినప్పుడు మీరెట్లా 'ఫీ' లైనారు ?

జవాబు : నేను ఆస్థాన కవిని అవాలని ఏ దశలోనూ కోరుకోలేదు, అవుతాననీ అనుకోలేదు మన దేశపు మువ్పైయవ స్వాతంత్ర్య దినోత్సవం నాడు – అనగా 1977 ఆగస్టు పదిహేనవ తేదీన నియామకం గూర్చి తెలిసింది. 'శుభం' అనుకున్నాను. ఈ గౌరవం నాకు లభించినందుకు మిత్రులు చాలా సంతోషించారు. నేనూ కవితా సరస్వతికి అంజలి ఘటించాను. మన ప్రభుత్వం వారి నిర్ణయానికి హర్షించాను. అయితే ఈ గౌరవం ఆధునిక కవితా దృక్పథానికని భావిస్తున్నాను.

ప్ర : ఆస్థాన కవులైనందువల్ల మీకు అదనంగా లభించే సౌకర్యాలు సదుపాయాలు యెలాంటివి-- దీనికి జీతనాతాలు, ఉద్యోగ ధర్మాలు (డ్యూటీస్) వుంటాయా ?

జ : ఆస్థాన కవికి అదనంగా సౌకర్యాలు, సదుపాయాలు ఏమీ ఉన్నట్లు లేదు. అయినా తెలుసుకోవాలి. జి. ఓ లో ఆ వివరాలు ఏవీ లేవు. యేటా రూ. ఆరు వేలు పారితోషికం లభిస్తుంది. ఉద్యోగ ధర్మాలంటూ యేవీ లేవు.

## స్వేచ్ఛకు భంగం లేదు

ప్ర : దీనివలన మీకు స్వేచ్ఛా కవితా గానానికి, సినిమా రచనలు లాంటివాటికి--ప్రతిబంధకాలు యేమైనా వుంటాయా ?

జ : దీనివలన నా స్వేచ్ఛకు ఏమాత్రం భంగం లేదు. సినిమాలకు రచనలు చేసుకోవచ్చు. ప్రతిబంధకాలు లేవు.

ప్ర : ఆధునిక కవితా రీతులలో – భావ కవిత్వం అభ్యుదయ కవిత్వం – దిగంబర కవిత్వం – దిగంబరేతర కవిత్వం – యిట్లా చాలా రీతులున్నాయని – అందరికీ తెలిసిందేకదా ? దీనివలన లాభమా ? నష్టమా ?

జ : ఆధునిక కవితారీతులు చాలా రకాలుగా వున్నాయి. ఇంకా నూతన రీతులు రావచ్చు. కొన్ని రీతులు అంతరించిపోయాయి. నూతన రీతులు రావడంవల్ల సాహిత్యానికి లాభమే అనుకుంటున్నాను. అయితే అనారోగ్యకరమైన రీతుల్ని నేను హర్షించలేను.

## కవిత్వం రాజకీయాలకు అతీతం

ప్ర : రాజకీయాలకి కవిత్వానికి 'ముడి'– తగునా ? తగదా ? ఎందువలన ?

జ : కవులకు రాజకీయాభిప్రాయాలుంటాయి. రాజకీయ పార్టీలతోనూ కవులు సంబంధాలు పెట్టుకుంటుంటారు. అవి వ్యక్తిగత విషయాలు. కాని కవిత్వం రాజకీయ పక్షాలకు అతీతంగా వుండడమే సమంజసమని నా అభిప్రాయం.



ప్ర : గద్య కవిత కూడా యీనాటిది కాదు - ఇంగ్లీష్‌లో కూడా షేక్స్‌పియర్ మహాకవి కూడా యేనాడో 'బ్లాంక్‌వెర్స్' రాశాడు – అంచేత గద్య కవిత అల్లడమే గొప్ప అనుకోనక్కరలేదు – రాసిందాంట్లో పస వుండాలి అంటున్నారు కొందరు విమర్శకులు -- గద్య కవిత్వం ప్రజల్లో ఉత్తేజాన్ని కలిగిస్తుందంటారా ?

జ : గద్య కవిత ఈనాటిది కాదు.

"వచన కవితకేనె ప్రారంభకుడనని
విర్రవీగునొకడు వెర్రివాడు;
వచన కవిత వ్రాసె బాణ మహాకవి;
క్రొత్త తనదె యనుట రిత్త కాదె" అని

ఒక పద్యం చెప్పాను. వచన కవిత ఎంతో కాలంగా అనేక భాషల్లో వుంది. మన భాషలోనూ వుంది. మీరన్నట్లు గద్య కవిత అల్లడమే గొప్ప అనుకోనక్కరలేదు. కవిత్వంలో పస వుండాలి. వాల్ట్‌విట్మన్ రాసిన "బ్లేడ్స్ ఆఫ్ గ్రాస్" మహాకావ్యం. మంచి కవిత ప్రజలకు ఉత్తేజాన్నిస్తుంది. గద్య రచన అయినంత మాత్రాన ప్రజలు హర్షించరు.

## ఇజాల ప్రభావం ?

ప్ర : పాశ్చాత్య దేశాల్లో తలయెత్తిన 'దాదాయిజం' 'క్యూబిజం' లాంటి రీతుల్ని మనవాళ్లుకూడా అనుకరించ ప్రయత్నించారు కదా ? ఇంకా అలాంటి 'యిజాలు' ఏమైనా అక్కడ వస్తున్నాయా ? అవి 'యిక్కడ'కి దిగుమతి అయితే రాణిస్తాయా ?

జ : "దాదా" అనేది పసిపిల్లలు గుర్రం బొమ్మకు వాడే ఫ్రెంచి మాట. అర్థంగాని, పిల్లల మాటల్తో ఏదో వ్రాసి కవిత అనుకోమంటే ఎవరనుకుంటారు ? క్యూబిజం, చిత్రలేఖనంలో కొంత ప్రయోగించబడింది. ఇప్పుడు [Konkrete Poesie] 'కాంక్రీట్ పోయెసీ' అనే రీతిలో -- అంకెలు, అక్షరాల కలయికతో కవిత్వం రాస్తున్నారు, జర్మనీ దేశంలో. కాని దీని ప్రభావం మన భాషలపై ఇంకా పడలేదు.

## క్రమశిక్షణకు ఛందస్సు

ప్ర : ఈ శతాబ్దంలో 77 సం.లు దొర్లిపోయాయి... ఇంకా ఛందోబద్ధమైన పద్యం మన సొసైటీలో బ్రతుకుతుందని మీరనుకుంటున్నారా ?

జ : పద్యం మన వెయ్యేళ్ళ పంట. పద్యం ఎప్పుడూ బతుకుతుంది. మంచి వచనం వ్రాయడం రావాలంటే మంచి పద్యం వ్రాయడం నేర్చుకోవాలన్నాడు అలెగ్జాండర్ పోప్. రచనలో క్రమశిక్షణకు, ఛందోబద్ధమైన పద్య రచన ప్రాథమిక దశలో ఉపకరిస్తుంది. ఆ తరువాత కవి తన భావాలకు తగిన ఛందోరీతిని తానే ఎన్నుకుంటాడు. పద్యం రాయడమే ప్యూడలిజం అనేవాళ్లున్నారు. అలా అనుకున్నప్పుడు, తెలుగు మాట్లాడ్డం కూడా ప్యూడలిజమే అవుతుంది. పంచె కట్టడం, అన్నం తినడం, ఉగాది పండగ జరుపుకోవడం ప్యూడలిజం అవుతాయా ?

ప్ర : వచనానికి పద్యానికి మధ్య పూర్వం వున్న రాతిగోడలు యిప్పుడు లేవనుకుంటున్నాను ! మీరేమంటారు ?

జ : మీతో ఏకీభవిస్తాను. కవిత అనేది ఉండాలి కాని ప్రక్రియ ఏదైనా ఒకటే. ★

# రాగమాలిక

శ్రీమతి
మాదవపెద్ది పుణ్యశీలాప్రసాద్

*(గత సంచిక తరువాయి)*

వదిన వచ్చింది లోపలికి.

నేను కుర్చీలో కూలబడివున్నాను.

మధు నిశ్చలంగా పడివున్నాడు.

భయం భయంగా వదినవంక చూశాను.

"మంజా! రేపు కండిషన్ చూసి ఆస్పత్రిలో చేర్పిద్దాం అన్నారు డాక్టరుగారు."

అంది వదిన నెమ్మదిగా.

"వద్దు వదినా వద్దు! ఆ హాస్పిటల్ అంటేనే నాకు భయం. అక్కడి కెళ్లినవాళ్లు మళ్లీ సవ్యంగా ఇంటికొస్తారనే నమ్మకం నాకు లేదు."

"ఛీ! అవేం మాటలు మంజా? ఎందుకు తిరిగిరారూ? ఎన్నో జబ్బులు నయమై తిరిగొచ్చినవాళ్లు ఎంతమందిలేరు? అయినా అక్కడైతే ఎన్నో ఫెసిలిటీస్ వుంటాయి. స్పెషలిస్టులు వుంటారు. మీ అన్నయ్య వస్తారుగా రేపొద్దున. ఆయన ఏదంటే అదే చేద్దాం."

అంతలో బాబు ఏడుపు విని తను వెళ్లిపోయింది.

వెళ్తూ "మంజా! నువ్వింకేమీ ఆలోచించక కాసేపు పడుకో. మధు కూడా పడుకున్నాడుగా? డాక్టరు చెప్పారు ఏమీ కంగారులేదు." అని చెప్పింది.

అటునించి ఇటు తిరిగి పడుకున్నాడు మధు. కళ్లు తెరిచాడు. వాంతి అయ్యాక మొహం తేటగా వుంది. ఇంజక్షను కూడా పనిచేసినట్లుంది.

"అమ్మా! ఎప్పుడూ కూచొనేవుంటావేం? నీకు నిద్రరావడంలేదూ?" అడిగాడు మధు.

"నువ్వు నిద్రపోయాక నేను నిద్రపోతాలే నాన్నా!"

"అమ్మా! మనింట్లో చిన్నబాబు వున్నాడా? రోజూ ఏడుపు వినబడుతుంది!"

"అవునురా నాన్నా! వున్నాడు."

"నాకు చూపించవా?"

"రేపు చూపిస్తాగా? ఇప్పుడు నిద్రపో నాన్నా! మా నాన్న కదూ?"

"నాకు మంచి కథ చెప్పు. నిద్రపోతాను."

వాడు గారాబాలుపోతుంటే నాకు సంతోషం వేసింది. తగ్గిపోతోంది. నా మధుకి నయమయిపోతోంది! దేవుడు కరుణించాడు!

కథ చెప్తూవుండంగానే నిద్ర వచ్చేసింది వాడికి. ఆలోచనలతో నిద్రెప్పుడు పట్టిందో కూడా ఆ తరువాత నాకు తెలియలేదు.

పొద్దున చాలా ఆలస్యంగా నిద్రలేచాను నేను.

నేను మొహంకడుక్కు వచ్చేసరికి డాక్టరుగారు వచ్చారు.

వదిన మా ఇద్దరికీ కాఫీ ఇచ్చింది. అంతలో అన్నయ్యకూడా వచ్చేశాడు.

అన్నయ్య, నేను, డాక్టరుగారు కాఫీలయ్యాక మధు గదిలో కొచ్చాం.

డాక్టరుగారు నిద్రపోతున్న మధుని చూశారు. చూస్తూండగానే నిద్రలేచాడు వాడు.

"మంజులాదేవిగారూ! ఇంక మీ అబ్బాయి కేమీ భయంలేదు. తగ్గుముఖం పట్టినట్లే. రాత్రి నేను కూడా భయపడ్డాను. ఫరవాలేదు గండం గడిచినట్లే."

డాక్టరుగారి మాటలతో కొండెక్కినంత సంతోషంవేసింది నాకు.

"అయితే డాక్టరుగారూ! హాస్పిటల్‌లో చేర్పక్కరలేదా?" అడిగాను ఆత్రుతగా.

"ఇంక అక్కరలేదమ్మా! మీరు పథ్యం మాత్రం చాలా జాగ్రత్తగా చేయించాలి. ఇంక ఒక నెల రెస్టు వుండాలి. ఆ తరవాతే మీ ఫరవాలేదు మందు మాత్రం కంటిన్యూచేస్తే చాలు."

అన్నారాయన కుర్చీలో కూచుంటూ. అన్నయ్య కూడా కూచున్నాడు.

"థాంక్యూ డాక్టర్! రాత్రి నాకు చాలా భయమేసింది." అన్నాను.

"అసలేం జరిగింది?" అడిగాడు అన్నయ్య.

డాక్టరుగారే అంతా చెప్పారు.

"మంజా! మన డాక్టరుగారు సాయంత్రం ఇంకో డాక్టరుగార్ని తీసుకొస్తున్నారు. ఆయన ఫారిన్ రిటర్న్‌డ్‌ట. ఆయన ఎక్కువగా ఈ కేసులే చూస్తారుట. మధుని ఆయనక్కూడా చూపిద్దాం అంటున్నారు."

మధుకి మందు తాగించి వచ్చిన నాతో అన్నాడు అన్నయ్య.

నేను సందేహంగా చూశాను.

"నువ్వింకేం సందేహాలు పెట్టుకోవద్దమ్మా! క్విక్ రిలీఫ్ ఏవిధంగా వస్తుందో చెప్తారాయన. అంటే మీ అబ్బాయి బాధ్యత మాకొదిలేసి నువ్వు నిశ్చింతగా నిద్రపో అమ్మా కంటినిండా."

హాస్యంగా అన్నారు డాక్టరుగారు.

ఆయన మా ఫామిలీ డాక్టరు. మాకు చిన్నప్పటినుంచి తెలిసినాయన.

సాయంత్రం వచ్చి చూసిన డాక్టరుగారు కూడా సంతృప్తిని ప్రకటించారు. ఆయన ముఖం చూస్తేనే తెలిసిపోతుందికదా మనకి.

ఆ రాత్రి నేను కంటినిండా నిద్రపోయాను.

ఆ తరువాత రెండురోజులకి — నేను లేచేసరికి మధు కుర్చీలో కూచునివున్నాడు. ఎన్నాళ్లయిందో వాణ్ణి అట్లా చూసి! నాకు కన్నులపండువగా వుంది!

బాబు కింద కార్పెట్‌మీద బొమ్మలతో ఆడుకుంటున్నాడు.

నవ్వుతూ వాణ్ణి చూస్తున్నాడు మధు!

నేను ఉలిక్కిపడ్డాను.

'వదినా!' గట్టిగా పిలిచాను.

"ఏమిటమ్మా!" అంటూ వచ్చింది వదిన చెంగుకి చేతులు తుడుచుకుంటూ.

"నీకేమన్నా మతిపోయిందా వదినా?"

"ఏం?"

"జబ్బు పిల్లవాడి దగ్గిర పసివాణ్ణి వదులుతావా? రేపు వాడికేమన్నా..."

"అబ్బ! ఊరుకోవమ్మా! వాడి సంగతి నాకొదిలెయ్." నవ్వుతూ మందలించింది వదిన.

అంతలో డాక్టరుగారు వచ్చారు.

వెనకే అన్నయ్య!

నేను అదే ప్రశ్న డాక్టరుగారిని అడిగాను.

"ఇది అంటుకునేది కాదమ్మా! ఫరవాలేదు. జాండీస్‌లో రకాలున్నాయి. వాటిల్లో అంటుకునేది-అంటుకోనిది వేరువేరుగా వుంటాయి."

అని చెప్పారు.

"మీ ఋణం తీర్చుకోలేం డాక్టరుగారూ!" అన్నాను నేను కళ్లు చెమర్చగా!

"ఫరవాలేదమ్మా — అది మా డ్యూటీ." అన్నారు నవ్వుతూ డాక్టరుగారు.

ఆరోజు నేను కడుపునిండా అన్నం తిన్నాను.

మధుకి నెమ్మది నెమ్మదిగా తగ్గుతూ వచ్చింది. పథ్యం చాలా జాగ్రత్తగా చేయిస్తున్నాను.

కొంచెం ఇంట్లో అటూ — ఇటూ తిరుగుతున్నాడు వాడు.

మరో రెండు వారాలకి నేనే బలవంతంచేసి

**జరిగిన కథ—3**

నిద్రమాత్రలు వేసుకుంటేగానీ నిద్రపట్టని జీవితం మంజులది. సంవత్సరమంతా అంధకారంలో గడిపే మంజుల జీవితంలోకి వెలుగుని తెస్తారు శలవులకి ఇంటికొచ్చే సుధ, మధులు. కానీ అందులోనూ అసంతృప్తే. కొడుకు వస్తే కూతురో, కూతురు వస్తే కొడుకో ఎవరో ఒకరు తండ్రి దగ్గర కెళ్లిపోతారు. ఇద్దరూ ఎప్పుడూ కలిసిరారు. చిన్ననాటి స్నేహితుడు రామం కలసి గుర్తుపట్టాడు మంజులని. రామం భార్య రాధ. బారసాల చేసుకున్న తర్వాత భార్య సుశీలని తీసుకుని చెల్లెలు మంజుల దగ్గరికి వస్తాడు రాజా. మధు అనారోగ్యం మంజులని మరింతగా క్రుంగదీస్తుంది.

వదినని అన్నయ్యతో పంపించాను. నేనుండగలనని చెప్పాను.

వదినకి మంచి చీర — రెండు జాకెట్టు గుడ్డలు — పిల్లవాడికి మంచి డ్రస్సులు రెండు. ఒక ఉంగరం పెట్టాను.

"ఏమిటి మంజా ఇవన్నీ ? ఎందుకిప్పుడు ? అప్పుడిచ్చావుగా చాలా ?"

ఈసారి వదిన నోరు నేను మూశాను.

"వదినా ! నువ్వు వదినవికావు. నా తల్లివి. నీ ఋణం తీర్చుకోలేను. నీ ప్రేమ వెలకట్టలేనిది. ఇవి నా సంతృప్తికి మాత్రమే."

వదినేం మాట్లాడలేదు. నన్ను దగ్గిరికి తీసుకుంది.

"మధుని జాగ్రత్తగా చూసుకో. నువ్వు నీ ఆరోగ్యంకూడా చూసుకోవాలి. సరేనా ?"

"వేళకి తిండీ నిద్రా వుండాలి !"

మళ్లీ హెచ్చరించింది.

వదిన కారెక్కుతుంటే నాకు ఏడుపాగలేదు. నిజంగా వదినే లేకపోతే నేనేమైపోయేదాన్ని ! కష్టసమయంలో వాళ్లు నాకు నిజంగా యెంత అండ ! అన్నయ్యకి నామీద ప్రేమవుండడం సహజమే. కానీ వదినక్కూడా వుండడం నా పూర్వజన్మ సుకృతమే !

నా భుజంపట్టి కళ్లు తుడుచుకుంటూ కారెక్కింది వదిన !

బాబుని ముద్దుపెట్టుకుని వదిన కందించాను.

"వారం వారం వస్తుంటాలేవే మంజా !" అన్నయ్య అన్నాడు చెమ్మగిల్లిన కళ్లతో.

చెయ్యూపాను. కారు కదిలింది.

మధూవాళ్లకి ఇంకో పదిహేనురోజుల్లో స్కూలు మూస్తారు. అందుకని ఈ టర్మ్‌కింక మధుని పంపించక్కరలేదనీ — నెక్స్ట్ టర్మ్ పంపించమనీ రాశారు వాళ్ల హెడ్‌మాస్టరు.

మధని తండ్రి దగ్గిరికి పంపిస్తున్నట్లు రాశారు సెలవులకి.

దేశంలో అన్ని రాష్ట్రాలనించీ వున్నారు ఆ స్కూల్లో. ప్రతిసారీ వెళ్లేటప్పుడు — వచ్చేటప్పుడూ గూడా ఒకరిద్దరు టీచర్లు వెంటవుండి తీసికెళ్తారు — తీసుకొస్తారు పిల్లల్ని. వాళ్లని తలితండ్రులకి వప్పగించడం— అక్కణ్ణించి తేవడం కూడా వాళ్లవంతే !

నిజంగా ఆ స్కూలు మాపాలిట వరంలాగా వుంది. ఈ పరిస్థితుల్లో విడిపోయిన తల్లితండ్రుల మధ్య పెరగడం పిల్లలకి అంత క్షేమకరం కాదు.

మధు ఆటపాటలతో రోజులు ఇట్టే గడిచిపోయాయి.

మధు పూర్తిగా కోలుకున్నాడు.

నా తండ్రి పునర్జన్మ ఎత్తాడు.

సుధ వాళ్ల నాన్న దగ్గిరే వున్నా, ఉత్తరాలు రాస్తూనేవుంది. తమ్ముడి క్షేమసమాచారాలు కనుక్కుంటూనేవుంది.

"నాన్న తమ్ముణ్ణి చూడాలని చాలా అనుకుంటున్నారు." అని రాసింది.

'చూడాలంటే రావచ్చుగా ? రాకూడదూ ?' నేననుకున్నాను.

ఇంకోవారంలో మధు వెళ్లిపోతాడనగా అన్నయ్య మధుని తన ఫ్రెండింటికంటూ తీసికెళ్లాడు.

అక్కడికి వాళ్ల నాన్న వచ్చి వాణ్ణి చూసి వెళ్లారని తరవాత తెలిసింది నాకు. నేను చాలా బాధపడ్డాను. ఇక్కడికివస్తే నేను కనిపిస్తానేమో ఇక్కడికి రాలేదు అనుకున్నాను.

నా సెలవు అయ్యాక మధుని వంటావిడకి అప్పజెప్పి వెళ్లేదాన్ని కాలేజీకి.

మధు సెలవులయిపోయాయి.

వెళ్లిపోయాడు స్కూలు పార్టీతో.

మూడు నెలలుగా కళకళలాడిన ఇల్లు మళ్లీ మూగబోయింది.

నా పరధ్యాన్నం మళ్లీ నాకు మొదలయింది.

## 9

ఆరోజు కాలేజీనించి వచ్చేటప్పటికే ఆలస్యమయింది. ఏదో మీటింగు వుండడం వలన లేట్‌గా వచ్చాను. అయినా ఇంటికి వద్దామన్నా ఉత్సాహం ఏది ? ఎవరున్నారు ఇంటిదగ్గిర నాకోసం ? నేను వచ్చానని సంతోషించేవాళ్లా— నేను రావాలని ఎదురుచూసేవాళ్లా రాలేదంటే ఆలస్యమయిందంటే కంగారుపడేవాళ్లా ఎవ్వరూ లేరు !

నా జీవితం యాంత్రికం.

రాధ కూర్చునివుంది హాల్లో. ఎంతసేపటినించి నాకోసం ఎదురుచూస్తోందో ?

సోఫాలో వెనక్కి జారగిలబడి కూర్చొని తల పైకెత్తి పైకప్పుకేసి చూస్తూ ఏదో ఆలోచిస్తోంది.

పూర్ణగర్భిణి రాధ ఎంతో అందంగా నిండుగా వుంది. ఆకుపచ్చని నైలెక్స్ చీర, మాచ్ అయే జాకెట్టు వేసుకునివుంది. చేతులనిండా ఆకుపచ్చని గాజులు. అటూ ఇటూ బంగారు గాజులు — పచ్చని చేతులు ముచ్చటగా వున్నాయి. పచ్చల నెక్లెసు — మంగళసూత్రం గొలుసూ మెళ్లో మరింత అందాన్నిస్తున్నాయి. రాధ పవిత్రంగా కనబడింది నా కళ్లకి — ఆ స్థితిలో !

నేను వచ్చినట్లు గమనించనేలేదామె.

నేనూ ఆమెని డిస్టర్బ్ చెయ్యకుండా లోపలికి నడిచాను.

వంటావిడతో కాఫీ టిఫిన్ తెమ్మనిచెప్పి, కాళ్లు చేతులు కడుక్కుని వచ్చాను మళ్లీ హాల్లోకి.

"వచ్చారా అక్కా !" అప్పటికి చూసింది రాధ నాకేసి.

రాధ నన్ను 'అక్కా' అనడం మొదలుపెట్టి చాలారోజులయింది.

"ఏమ్మా రాధా ! ఇట్లావచ్చావు ? నువ్వీ స్థితిలో శ్రమపడి రావడమెందుకు చెప్పు ? కబురుచేస్తే నేనే వచ్చేదాన్నిగా ?" పక్కన కూర్చుని తల నిమురుతూ అన్నాను. నేను







ముచ్చటైన ముగ్గు పెడుతున్న ముగ్ధ : దూడూ బసవన్న

ఫొటోలు : కె. సత్యనారాయణ ప్రసాద్.

వాళ్ళింటికి వెళ్ళి చాలారోజులయింది. వాళ్ళు ఏ కారణంచేతనో రావడంలేదు ఈమధ్య.

"నేను మావాళ్ళింటికి వెళ్తున్నాను. మీతో చెప్పి వెళ్దామని వచ్చాను."

తల వంచుకుని అన్నది.

ఎందుకోమరి. రాధ నాతో యింకేదో చెప్పడానికి వచ్చిందనీ, చెప్పలేకపోతోందనీ, నాకు అనిపించింది. అయినా నా భావాలన్నీ లోలోపలే దాచుకుంటూ —

"చాలా సంతోషం రాధా! పండులాంటి కొడుకు నెత్తుకుని క్షేమంగా రావమ్మా!" అన్నాను రాధ రెండు చేతులూ పట్టుకుని.

పట్టుకున్న నా చేతులమీద కన్నీరు బొట్లు బొట్లుగా రాలింది.

నేను ఉలిక్కిపడ్డాను.

"రాధా ఏమిటిది? ఎందుకీ కన్నీరు? అంతా సవ్యంగా జరిగిపోతుందిలే! దిగులు పడకు."

భుజం తట్టాను.

'అక్కా!' ఇక నిగ్రహించుకోలేనట్లు నా భుజం మీద వాలి బావురుమంది.

రాధ ఎందుకో మనసులో చాలా బాధ పడుతోంది. ఎందుకు? రామం సరిగ్గా చూడడం లేదా? రామానికి రాధంటే ఎంత ప్రేమో నేను ప్రత్యక్షంగా చూశానుగా — అత్తగారు ఆరళ్ళు పెడుతోందా? ఛీ — ఛీ — రామం తల్లి అట్లాంటిది కాదు. మరెందుకు రాధకీ బాధ? ఎందుకీ ఏడుపు? పురుడు సవ్యంగా వస్తుందో — రాదో అనా? పుట్టిన బిడ్డ దక్కుతాడో — దక్కడో అనా? అందరికీ వుంటుంది అదొక రకమైన ఆందోళన — కానీ యింతలా బాధపడరే ఎవరూ?

రాధని సరిగ్గా కూచోబెట్టాను.

వంటావిడ కాఫీ — ఫలహారం తీసుకొచ్చింది.

"ఎంతసేపయిందండీ రాధ వచ్చి? కాస్త

## రాగమాలిక

కాఫీ అన్నా యివ్వలేకపోయారా?"

"అయ్యో — ఇస్తానన్నానమ్మా — వద్దంటే వద్దన్నారు. కాసేపు పడుకోమని గూడా చెప్పాను. వద్దన్నారు. మధ్యాహ్నమనగా వచ్చారమ్మా! అప్పటినించీ అట్లాగే కూచున్నారు. వట్టి మనిషి కూడా కాదా? నడుములు పట్టుకున్నాయో ఏమో..."

ఆవిడ విసురుగా పెట్టింది.

"అవునా రాధా? ఏమిటమ్మా ఈ పని? ముందు కాఫీ తీసుకో."

రాధ అభ్యంతర పెట్టలేదు.

మౌనంగా వడలు చట్నీతో తిని—కాఫీ తాగి—చేతులు కడుక్కుని వచ్చి కూచున్నాం మళ్ళీ.

"అక్కా, మీతో కొన్ని విషయాలు మాట్లాడాలి. నా మనసులో వున్నదంతా చెప్పి నా బాధ తీర్చుకోవాలి!"

రాధని బెడ్ రూములోకి తీసికెళ్ళాను. తలుపులు గడియ పెట్టి వచ్చాను.

రాధ చెప్పడం మొదలుపెట్టింది —

రాధ మంచి ఆస్తి గల కుటుంబంలో పుట్టింది. తల్లితండ్రులది ప్రేమ వివాహం. అటూ — ఇటూ పెద్దలకి యిష్టం లేకుండా చేసుకున్నారు వాళ్ళు. వాళ్ళందరికీ దూరమయ్యారు. రాధని పుట్టినప్పటినించీ ఎంతో అపురూపంగా — అల్లారుముద్దుగా పెంచుకున్నారు వాళ్ళు. ఆడింది ఆట — పాడింది పాట ఆమెకి. ఏది కోరినా తక్షణం ఆమె ఎదుట వుండేది అది. ఒక విధంగా రాజకుమార్తెలాగా పెరిగింది ఆమె. రాధ తండ్రికి రాధంటే పంచ ప్రాణాలు. చిన్న ముల్లు గుచ్చుకున్నా సహించేవాడు కాదు. ఎంతో హడావిడి చేసేవాడు. రాధ తల్లిని ఆయన ఎంతో ప్రేమించాడు — ఆ ప్రేమ ఫలితమైన రాధంటే ప్రాణమే కదా! రాధకు పన్నెండేళ్ళ వయసు వచ్చేవరకే ఈ విధంగా సాగింది. ఆ తరువాత రాధ తల్లికి కాన్సర్ వ్యాధి వచ్చింది. ఎన్ని వైద్యాలు చేయించినా నయంకాలేదు. సరికదా ఇంకా ముదిరింది. చివరికి ఆమె ప్రాణాల్ని కూడా బలితీసుకుంది ఆ వ్యాధి!

అప్పట్నించే రాధకి కష్టాలు ప్రారంభమైనాయి. రాధంటే ప్రేమ తగ్గలేదుకానీ —

రాధ తండ్రి ప్రేమించి పెళ్ళి చేసుకున్న భార్య పోవడంతో ఆ దెబ్బకు తట్టుకోలేకపోయాడు. కొంతమంది మనుషులు ఎటువంటి ఒడిదుడుకులనైనా ఓర్చగలరు. ఎన్ని విఘాతాలనయినా భరించగలరు. సహించి నిలబడగలరు. కానీ, దురదృష్టవశాత్తు రాధ తండ్రి చాలా సున్నిత మనస్కుడు. కష్టాలనెప్పుడూ చవిచూచినవాడు కాదు. ఒక్కసారిగా తగిలిన ఈ దెబ్బకి ఆయన తట్టుకోలేకపోయాడు. ఢీలా పడిపోయాడు. తిండీతిప్పలు మానేశాడు. కాస్త పిచ్చిధోరణి కూడా వచ్చేసింది. కూతురెక్కడుందో, ఏం చేస్తోందో కూడా పట్టించుకునేవాడుకాదు. ఉన్నట్టుండి భోరున ఏడ్చేవాడు. తనలో తనే ఏదో మాట్లాడుకునేవాడు. ఆ బాధ మర్చిపోడానికి తాగుడు కూడా మొదలుపెట్టాడు. చేస్తున్న ఉద్యోగం వదిలేశాడు. ఆస్తి తరిగిపోవడం మొదలుపెట్టింది.

పన్నెండేళ్ళ రాధ తండ్రిని చూస్తూ ఏమీ చెయ్యలేక, చెయ్యకుండా వుండలేక ఏడుస్తూ కూచునేది. తనూ స్కూలు మానేసింది. చెయ్యి కాల్చుకుంటూ వచ్చీరాని వంటచేసేది. తండ్రి తినకపోతే తనూ తినేదికాదు.

ఆ సమయంలో విచిత్రమైన సంఘటన ఒకటి జరిగింది. అంతదాకా ఏదీ పట్టించుకోని రాధ మేనమామలు రాధ ఆస్తిమీద కన్నువేసి రాధ తండ్రితో పోట్లాడి — మిగిలిన ఆస్తిలో రాధ

# రాగమాలిక




పేరుమీద సగం రాయించుకుని రాధని వాళ్లతో తీసికెళ్లారు. రాధ రానని ఏడ్చినా వాళ్లు వినలేదు. 'నీ భవిష్యత్తు పాడుచేసుకుంటావా' అని మందలించి లాక్కెళ్లారు. రాధకి తండ్రినా స్థితిలో వదిలి వెళ్లడం ఇష్టంలేకపోయినా ఏమీ గత్యంతరం లేకపోయింది.

తరువాత రెండు నెలలకే తన తండ్రి ఇంకో పెళ్లి చేసుకున్నట్లు తెలిసిన రాధ అసలు విచారించలేదు. ఆవిధంగానైనా తండ్రిని చూసుకునేవాళ్లు వచ్చారుగదా అని సంతోషించింది.

మేనమామలు ఆస్తి తామే దక్కించుకుందామని చూశారుగానీ కుదరలేదు. మేనమామ కొడుకులు రాధ కంటే చిన్నవాళ్లే. రాధ ఆస్తి మీద వస్తున్న ఆదాయాన్ని తింటూ — రాధని చాకిరీకి ఉపయోగించుకుంటూ — పేరుకి స్కూల్లో చేర్చారు. ఇంటి చాకిరీతో అలసిపోయిన రాధ ఏమీ చదవగలిగేదికాదు. ఫలితం పరీక్షలు తప్పింది. మళ్లీ చేరి చదివినా ఎస్. ఎస్. ఎల్. సి. దాటలేకపోయింది.

పెళ్లి సంబంధాలు చూడడం ప్రారంభించారు మేనమామలు. పెళ్లి ఖర్చులకి, కట్నాలకి అంటూ రాధ ఆస్తిని అమ్మారు. నీ ఇష్టమేమిటని అడగకుండానే ఒక సంబంధం స్థిరపరచారు. పిల్లాడు బాగానే వుంటాడన్నారు. పెద్దగా చదువుకోలేదుట. పెళ్లి జరిగిపోయింది మామూలుగా. పెళ్లికి రాధ తండ్రి రాలేదు. అసలు వీళ్లు పిలిచారో లేదోకూడా! ఆస్తి విషయాలు బయటపడతాయనో మరేమో పిల్వుండరు అనుకుంది రాధ. పెళ్లి జరుగుతున్నప్పుడు తల్లిదండ్రులను తల్చుకుని ఏడ్చింది రాధ చాలాసేపు. ఎవరూ పట్టించుకోలేదు. అప్పటికి రాధకి పద్దెనిమిదేళ్లు. ఎంత కట్నం ఇచ్చారో, మిగిలిన డబ్బు ఏం చేశారో రాధకి తెలీదు. అడగలేదు. అడిగినా చెప్పరెవ్వరూ — అసలు లక్ష్యపెట్టరు.

చెప్పడం ఆపింది రాధ.

'రాధకి ఒకసారి పెళ్లయింది —' ఈ మాట జీర్ణించుకోడానికి నాకు కాసేపు పట్టింది.

నా ముఖ కవళికలు పరిశీలిస్తూ మళ్లీ మొదలుపెట్టింది రాధ —

పెళ్లి అయ్యాక రాధ కష్టాలు యింకా ఎక్కువయ్యాయి. భర్తకి లేని వ్యసనాలు లేవు. సవ్యమైన ఉద్యోగం లేదు. పెళ్లి చేస్తే వ్యసనాలు తగ్గుతాయని పెళ్లి చేశారు. పెళ్లి చేస్తే అవి తగ్గకపోగా ఏడ్చేవాళ్లు యింకా ఎక్కువయ్యారు. తల్లిదండ్రులు కూడా లక్ష్యపెట్టని మొగుడు వాళ్లనికూడా దూరం చేసుకున్నాడు. రాధ గోడు వినేవాళ్లే లేకపోయారు ఆ ఇంట్లో. చిన్నప్పట్నుంచీ ఎవ్వరిచేతా దెబ్బలు తిని ఎరగని రాధ భర్త చేతిలో దెబ్బలు కూడా తినసాగింది. రాధ వంటిమీద వున్న కాస్త—కూస్త బంగారాన్ని కూడా వల్చుకున్నాడు. అమ్ముకున్నాడు. పైగా — "దమ్మిడీ కట్నం లేకుండా కట్టుకున్నాను నిన్ను — ముందు పోయి పదివేలు నాకు కట్నంగా తీసుకురా - ఫో —" అంటూ తన్నేవాడు.

"అమ్మ చచ్చింది. అబ్బ బతికున్నా చచ్చినట్టే లెక్క. ఎవడికీ పట్టని నువ్వు నాకుమాత్రం ఎందుకు ?" అని చిత్రహింస పెట్టేవాడు.

"చదువుకున్నదయినా అయితే — యింత డబ్బు సంపాయించి నా చేతిలో పోసేది. నువ్వొత్త తిండిదండగ మనిషివి--" అంటూ చావబాదేవాడు.

రోషం వచ్చి -- తిండి—నీళ్లూ ముట్టుకునేది కాదు. రాధ రోజులకి — రోజులు! నీరసం వచ్చి అడుగు కదపలేకపోయేది — ఆ తరువాత.

పని చెయ్యలేదని కోపంతో కొట్టేవాడు. కొన్నాళ్లకి దెబ్బలకికూడా అలవాటుపడిపోయింది రాధ. అట్లా రోజులు గడిచాయి. భర్త అనురాగం అంటే ఏమిటో కల్లోకూడా ఎరగదు రాధ. అప్పటికి తెలిసింది రాధకి—తన భర్తకి వ్యభిచారం గూడా వుందని! ప్రియురాళ్లని ఇంటికే తెచ్చేసేవాడు. వాళ్లకి ఊడిగం చేయించేవాడు రాధచేత. వాళ్ల ఎదురుగానే రాధని చీదరించుకునేవాడు. కొట్టేవాడు. రాధ వస్తువులూ — చీరలూ అన్నీ వాళ్లకే కట్టబెట్టేశాడు. చిరిగిన చీరలతో వేళ్లాడేది రాధ. అయినా అన్నీ సహించింది రాధ. కిమ్మనలేదు. ఊరుకున్నకొద్దీ రెచ్చిపోయేవాడు.

చివరికి ఒక ప్రియురాలు ఏం చెప్పిందో ఏమో రాధని ఏదో నెపాన స్పృహపోయేదాకా కొట్టాడు. బయటికి నెట్టి తలుపేసేశాడు. "నీ దిక్కున్నచోటికి ఫో! నీకూ నాకూ సంబంధం లేదు ఫో! ఫో!" అని ఎంత మొత్తుకున్నా తలుపే తీయలేదు. అయినా రాధ మొండికేసి ఆ అరుగుమీదే కూర్చుంది రాత్రంతా— మూసివున్న తలుపులకేసి చూస్తూ! తెల్లవారాక చూస్తే మూసివున్న తలుపులకు తాళంవేసి వుంది! వాళ్లు అర్ధరాత్రి ఎప్పుడు బయటి కెళ్లిపోయారో తనకి తెలియనేలేదు. తరవాతరోజల్లాకూడా రాలేదు. నీరసం వచ్చేసింది. జ్వరం వచ్చింది! ఏం చెయ్యాలి ? పక్కింటివాళ్ల నడిగి కాస్త డబ్బు చేబదులు తీసుకుంది. మొదట సందేహించినా ఆమె పరిస్థితికి జాలిపడి ఇచ్చారు వాళ్లు. తండ్రి దగ్గిరికి వెళ్దామనుకుంది. కానీ హాయిగావున్న తండ్రిని తనిప్పుడు వెళ్లి బాధపెట్టడం ఎందుకనుకుంది. అదీగాక తండ్రి యిప్పుడు అదే ఊళ్లో వున్నాడో — లేదోకూడా తనకు తెలియదు. అందుకని రైలెక్కి మేనమామల దగ్గిరికే వచ్చేసింది మళ్లీ.

వాళ్లు మరీ చులకనగా చూడడం ప్రారంభించారు. అవును ముందయితే ఆస్తి వుండేది తనకి. ఇప్పుడు అదీ లేదుగా? అదీగాక మొగుడు వదిలేసిన ఆడదంటే అందరికీ లోకువేగా ? మేనమామల భార్యలు మాటిపోటిమాటలనేవాళ్లు. భరించడం నేర్చుకుంది. ఒకరోజు పెద్దమేనమామ దగ్గిర మొరపెట్టుకుంది. కాస్త కనికరించాడాయన. రాధ భర్త దగ్గిరికి వెళ్లాడు రాయబారానికి. వెళ్లిన మర్నాడే విడాకుల కాగితంతో తిరిగివచ్చాడు. ఏం జరిగిందని అడగలేదు రాధ. అది చూస్తేనే అర్థమయిపోయింది.

ఆ తరువాత మరీ నికృష్టమయిపోయింది రాధ బతుకు. మేనమామ కొడుకులు తనకన్న చిన్నవాళ్లైనా వెకిలివేషాలేసేవాళ్లు. ఏవేవో విసుర్లు విసిరేవారు. అన్నిటికన్నా ఇవి భరించడం కష్టంగావుండేది రాధకి.

ఒకసారి పెద్దమేనమామ కొడుకు రాధ చెయ్యిపట్టుకుని అల్లరిపెట్టాడు. అత్తలకు చెప్తే వాళ్లు రాధనే తిట్టిపోశారు. "మొగుడొదిలేశాడని ఎవడంటేవాడే నీమొగుడనుకుంటావేం—అందుకే వదిలేసుంటాడు వాడు."

ఈ మాటలు భరించలేకపోయింది రాధ.

ఇంకేమైనాసరే తండ్రి దగ్గిరికి వెళ్లిపోదామనుకుంది. ఈ బాధలింక భరించలేననుకుంది. పెద్దమేనమామతో పోరుపెట్టి పోరుపెట్టి తండ్రి దగ్గిరికి తీసికెళ్లమని గోలచేసింది. కొన్ని రోజులపాటు ఆయన పెడచెవినిపెట్టినా చివరికి ఏమిటీ సొద అనుకున్నాడో — పంపిస్తే తనకి పీడ వదులుతుంది అనుకున్నాడో — జీవితాంతం ఎవడు భరిస్తాడీ కొరివిని అనుకున్నాడో — లేకపోతే

[34వ పేజీ చూడండి]

# ~~ జి. వి. జి. పేజీ ~~

### కథ మలుపు

చాలా చిత్రాలలో ఒక పాము ప్రవేశంతో కథ మలుపు తిరగడం సాధారణంగా మనం చూస్తూంటాం. కథకద్వయం సలీమ్ జవేదలలో రెండోవ అతనికి బొంబాయి 'బాంద్రా'లో "స్ప్రింగ్" అనే భవంతి వుంది. అందులోకి ఒక రాత్రి ఎక్కడ్నించో ఓ పాము జొరబడింది. ఆ పాముకు ఏమాత్రం హాని కలగకుండా తరిమేయించాడు జవేద్. ఇది శుభసూచకమా? అశుభసూచకమా — అని అతన్ని ఒకరు అడిగితే, "అదేమో నాకు తెలీదుగాని, త్వరలోనే మా పక్కింట్లోకి ఒక పేరుమోసిన తార అద్దెకు రాబోతోంది," అన్నాడతను.

### ది నక్సలైట్స్

రచయిత, దర్శక నిర్మాత కె. ఎ. అబ్బాస్ తను తీయదలచిన "ది నక్సలైట్స్" చిత్రానికి స్క్రిప్టు రాయడంలో నిమగ్నుడై వున్నాడు. ఆయన వయసు 63. బాగా విశ్రాంతి తీసుకోవాలని డాక్టర్లు చెప్పినా ఖాతరు చేయకుండా ఆ స్క్రీన్‌ప్లేను నిద్రాహారాలుమాని రాత్రింబవళ్లు రాస్తున్నాడు. ఆ స్క్రిప్టును ముందుగానే సెన్సార్‌కోసం సమాచార ఆకాశవాణి మంత్రిత్వ శాఖకు దాఖలు చేశాక సాంకేతిక నిపుణుల, నటీనటుల సహకారంతో షూటింగ్‌కు ఉపక్రమిస్తాడు. వచ్చిన లాభాలను అందరూ పంచుకుంటారు. టూకీగా ఈ చిత్ర కథ: ఒక యువకుడు నక్సలైట్ అన్న అనుమానంతో అరెస్టు చేయబడతాడు. విచారణ జరిగాక అతన్ని నేరస్థుడుగా ధృవపరచి, అతనిపై తుపాకీ పేలుస్తారు. అతన్ని అంబులెన్స్‌లో స్మశానవాటికకు తీసుకెళ్తారు. కాని, అతను చావలేదు. ఒంట్లోకి రెండు మూడు తూటాలు చొచ్చుకుపోయినా సజీవంగానే వుంటాడు. అరెస్టవడానికి ముందు 'నక్సలైట్' కాదతను. కాని, ఆ తర్వాత అవుతాడు.



'ఆడదంటే అలుసా ?'తో ఒక సన్నివేశం.

### పిలకజుట్టు నాయుడుబావ

గార్డు పచ్చజండా చూపాడు. రైలు కదిలింది. రాజు చేతిలో పాల క్యాన్‌లతో జనాన్ని తోసుకుంటూ హడావిడిగా పరుగెత్తుకుంటూ వచ్చి, కంగారుగా ఒక ఫస్టు క్లాస్ కంపార్ట్‌మెంట్ లోపలికి జొరబడ్డాడు. దీప కెవ్వుమని అరిచింది. ఆమె స్నేహితురాండ్రు కూడా భయపడ్డారు. రాజు వాళ్లందర్నీ ఒక్కసారి తేరిపార చూసి, "భయపడకండి. నేను దొంగనుకాను," అన్నాడు.

దీప : మరి దొరవా ?

రాజు : ఊఁహూఁ ... మాది బెల్లంపల్లి. బస్తీలో పాలమ్ముకొని వస్తున్నాను. హడావిడిగా ఎక్కేశాను. పక్క స్టేషన్‌లో దిగిపోతాను.

రూప : చూడు, బెల్లంపల్లీ! ఇది ఫస్ట్‌క్లాస్ కంపార్ట్‌మెంట్. పోలీసులను పిలిస్తే ఏమౌతుందో తెలుసా ?

దీప : పాపం. పల్లెటూరివాడు. హడలగొట్టకే.

గీత : మిస్టర్! నీ పేరు ?

దీప : చూస్తే తెలియడంలా ? నాయుడు బావ.

రూప : ఉత్త నాయుడు బావ కాదు; పిలకజుట్టు నాయుడుబావ. (అంటూ రిబ్బన్ కట్టిన రాజు జుట్టును చూపింది. అందరూ పకపక నవ్వారు.)

అమ్మాయిలంతా గేలిచేస్తూ, పాటపాడుతూ, రాజును నానాలభస చేశారు.

రాజు బయటికి పోలేక, వాళ్ల అల్లరికి తట్టుకోలేక గిజగిజలాడిపోయాడు. కాని, ఆతర్వాత వాళ్లంతా ఆమాంతంగా విస్తుపోయేలా చేశాడు.

పి. చంద్రశేఖరరెడ్డి దర్శకత్వంలో ఎం. ఎస్. రెడ్డి నిర్మించిన "నాయుడుబావ" వర్ణ చిత్రంలోని తొలి సన్నివేశమిది. మాటలు, పాటలు : మల్లెమాల. రాజుగా శోభన్‌బాబు, దీపగా జయసుధ నటించారు. సంక్రాంతి కానుక.

### మోహనరాగం

"ఒక మనసు పాడితే మోహనరాగం. రెండు హృదయాలు కూడితే జీవనరాగం." ఎన్. గోపాలకృష్ణ బి. ఎస్‌సి. దర్శకత్వంలో పెద్దాడ అప్పారావు



నిర్మించే స్వాతీ ఆర్ట్ పిక్చర్స్ "మోహనరాగం" చిత్రానికి ఇటీవల జెమినీ స్టూడియోలో పై పాట రికార్డు చేయబడింది. సంగీతం : వేణు కథ : భీశెట్టి లక్ష్మణరావు. గీతాలు : సి. నారాయణరెడ్డి, దాశరథి, చెర్వు అంజనేయశాస్త్రి.

### ఆరు నిమిషాల పాట

"ముసి ముసి ముసి నవ్వెందుకు ?"
"నువ్వు గుస గుస మన్నందుకే"
"నీ కసి కసి చూపెందుకు ?"
"నువ్ మిస మిస అన్నందుకే!"

జపాన్ దేశపు ప్రేమికుల్లాగా, రోమియో జూలియట్‌లలాగా, జానపద నాయికా నాయకులు లాగా వివిధ కాస్ట్యూమ్‌లలో కనిపించే ఎ.ఎన్.ఆర్, వాణిశ్రీలపై చిత్రీకరింపబడిన పై వేటూరి సుందరరామమూర్తి గీతం సురేష్‌వారి "చిలిపి కృష్ణుడు" వర్ణచిత్రంలోనిది. బోయిన సుబ్బారావు దర్శకత్వంలో డి. రామానాయుడు నిర్మించిన ఈ చిత్రం సంక్రాంతి కానుక.

# సినిమా విశేషాలు

## కృష్ణ చిత్రల కొత్త చిత్రం

"సావాసగాళ్లు" చిత్రంలో జనాకర్షణీయమైన జంటగా పేరు గడించిన "కృష్ణ... జయచిత్ర"గార్ల కాంబినేషన్ను నలుగురు ఎంపికచేశారు

ప్రసన్నలక్ష్మి పిక్చర్స్ వారి "ముత్తయిదువు", సారథీ స్టుడియోస్‌వారి వర్ణ చిత్రం, శ్రీలక్ష్మి నారాయణ కంబైన్స్ వారి "అందడు...ఆగడు... అదరడు" చిత్రం గాక దర్శక...నిర్మాత శ్రీ ఎమ్. ఎస్. గోపీనాథ్ జనవరి ఒకటేన ప్రారంభించే "చెప్పింది చేస్తా" స్కోప్ వర్ణ చిత్రం. ఈ నాలుగుతోబాటు మరో రెండు చిత్రాలలో కృష్ణ చిత్రల కలయిక జరిగేట్టుంది.

కృష్ణ చిత్రలు కలిసి నటిస్తున్న చిత్రాలలో వెరైటీ కథాబలం వుండడంవల్ల... అన్నిటికి ప్రేక్షకాదరణ లభించగలదని ఆశిద్దాం.

## కృష్ణ ప్రియ పాల్గొనే స్కోప్ చిత్రం

హీరో కృష్ణ, "చిలకమ్మ" శ్రీప్రియ ముఖ్య జంటగా శ్రీ పద్మావతీ పిక్చర్స్ డిశంబర్ 16న ప్రారంభించిన "దోపిడీ దొంగలు" స్కోప్ చిత్రం కొత్త సంవత్సరంలో, ప్రేక్షకులకు వీర శృంగార వినోదాల విందును అందివ్వగల అంశాలను గొనియున్నది.

ఈ చిత్రంలో మురళీ–ప్రభ మరో జంటగా నటిస్తున్నారు. చిత్ర పరిశ్రమలోని అతిరథ మహారథ అర్థరథులందరు యీ చిత్రంలో అత్యంత ఆకర్షణీయమైన పాత్రలను పోషిస్తున్నారు.

హార్స్‌లీ హిల్స్‌పై ఒకటిన్నర లక్షలు ఖరీదు చేసే సెట్టును, ప్రేక్షకులు గుంపులు గుంపులుగా వచ్చి తమ పరవశాన్ని ప్రకటించి వెళ్తున్నారు.

ఒక హాలివుడ్ చిత్రాన్ని చూస్తే వచ్చే "అనుభూతి" తన చిత్రంలో తెచ్చేందుకు నిర్మాత శ్రీ సూర్యనారాయణబాబు ప్రయత్నిస్తున్నారు. దీనికి ఎమ్. మల్లికార్జునరావు దర్శకుడు.



(*) (*) (*) (*) 'గోరంతదీపం'లో శ్రీధర్, వాణిశ్రీ (*) (*) (*) (*)

## ఊసులాడుకున్న అమాయక హృదయాలు

బస : ఏమమ్మో! ఈ సిగ్గు ఎందాక ఎందాక ?
మల్లి: ఓరయ్యో! ఈ సిగ్గు ఊరేగునందాక
పెళ్లి ఊసంటే ఓరబ్బో ?
కళ్ళు తేలేసినావు ఇన్నాళ్ళు
బస : ఎక్కువేమి అడగలేదు మల్లమ్మో!
ఒక్క ముద్దుపెట్టి చూడు ఓలమ్మో!
మల్లి: ముంగిట పన్నాయి మోగందే ఎహె!
ముద్దిమ్మంటే మజాకా ?

"డూ డూ బసవన్న" చిత్రంలో సి. నారాయణరెడ్డి రాసిన పై పాట చలం, దీపలపై ఏలేశ్వరంలో చిత్రీకరించారు డైరెక్టర్ బి. వి. ప్రసాద్. సంగీతం : సత్యం. శ్రీ రమణ చిత్ర ఆర్ట్స్ పతాకం కింద శ్రీమతి సీతాపద్మరాజు నిర్మించే ఈ చిత్రానికి నిర్మాణ నిర్వహణ : శాండిల్య. మాటలు : పినిసెట్టి. ఛాయ : పి. ఎస్. ప్రకాష్. ★



'బాలనాగమ్మ'లో రమాప్రభ, అల్లు రామలింగయ్య



'అల్లరి బుల్లోడు'లో కృష్ణ, జయప్రద

## సినిమా

# కొత్త సంవత్సరంలో స్టార్ ప్రొడ్యూసర్ కొత్త పథకం

అగ్రనాయకులకు ప్రజల్లో ఎంత పాపులారిటీ వుందో, అంత సురేష్ అధినేతకు వుందిగాబట్టే... శ్రీ రామానాయుడును "స్టార్ ప్రొడ్యూసర్" అనగలుగుతున్నాము.

శ్రీ నాయుడు వారి స్థానిక ఆఫీసులో పత్రికా సమావేశం ఏర్పాటుచేసి, కొత్త సంవత్సరంలో తన పథకాన్ని గూర్చి విపులంగా వివరించారు.

1978లో సినిమాస్కోప్ వర్ణచిత్రాన్ని తన దర్శకత్వంలో రూపొందించే నిర్ణయాన్ని నాయుడుగారు వెల్లడించారు.

రాబోయే వత్సరంలో రెండు తెలుగు చిత్రాలు సురేష్ సంస్థనుంచి రాగలవని, ఒక చిత్రంలో శ్రీ నాగేశ్వరరావు కథానాయకుడుగా వుండగలరని, మరొక చిత్రంలో నలుగురు నాయకులు పాల్గొనగలరని ఆయన తెలిపారు.

### ఎవరా నలుగురు ?

తమిళ రచయిత శ్రీ సుహానాథన్ సమకూర్చిన "నలుగురి కథ"లో తెలుగు...తమిళ...కర్ణాటక...కేరళ చిత్ర నాయకులు ప్రధాన పాత్రలను పోషించగలరని శ్రీ నాయుడు చెప్పారు. మార్చి... ఏప్రిల్ నెలల్లో షూటింగు తలపెట్టినట్టు, ఆ చిత్రానికి కథా రచయితనే దర్శకుడుగా పెట్టే వుద్దేశ్యం తనకున్నట్టు, శ్రీ నాయుడు వ్యక్తపరచారు.

### భారీ చిత్రాలపై ఆసక్తి !

లఘు బడ్జెట్ చిత్రాల నిర్మాణానికి తను సుముఖంగా లేరని... సురేష్ సంస్థ నుంచి ప్రేక్షకులు భారీ చిత్రాలనే ఎదురు చూస్తున్నారని సురేష్ అధినేత వెల్లడించారు.

అవార్డులపై తనకు నమ్మకం లేదని.. ఫారిన్ మార్కెటింగ్‌పట్ల మోజు లేదని ఆయన వివరిస్తూ, తాష్కెంట్ ఫిల్మోత్సవానికి వెళ్ళిన "సోగ్గాడు" ప్రింటు సంవత్సరం తరువాత తిరిగొచ్చిన సంఘటనను పేర్కొన్నారు ఆ ప్రింటు తనదగ్గర వుండివుంటే... దాదాపు లక్ష రూప్యముల వ్యాపారం జరిగివుండేది, అన్నారు శ్రీ నాయుడు.

### నాగేష్ దర్శకుడైనది ఎలా ?

"సావాసగాళ్ళు" షూటింగు వాహిని ఏడో ఫ్లోర్‌లో జరుగుతున్న రోజుల్లో, ఒక రోజున శ్రీ నాగేష్ "మొరటోడు" కథను చెప్పినప్పుడు.. ఆ చిత్రానికి అతడే దర్శకుడయితే సమంజసంగా వుంటుందని నిర్ణయించినట్టు శ్రీ నాయుడు వెల్లడిస్తూ, ఆ కథను శివాజీగారితో తమిళంలో చెయ్యమని నాగేష్‌ను కోరినట్టు కానీ ఆయన తెలుగు చిత్రానికి మోజుపడిన పరిణామ ఫలితమే "మొరటోడు" చిత్ర నిర్మాణం, అన్నారు శ్రీ నాయుడు.

కొద్ది మార్పులతో "మొరటోడు" చిత్రాన్ని శివాజీగారితో తమిళంలో, వినోద్‌ఖన్నాతో హిందీలో నిర్మించే నిర్ణయాన్ని శ్రీ నాయుడు తీసుకున్నారు. తమిళ చిత్రాన్ని నాగేష్‌గారే డైరెక్ట్ చేస్తారని చెప్పారు.



'చిరంజీవి రాంబాబు'లో బాలయ్య, రంగనాథ్

# చేసిన పరీక్షల వలన తేలింది...







# రుచికీ, విటమిన్లకూ, పుష్టికీ బిస్కట్ అంటేనే ఇది

## బ్రిటానియా

# గ్లూకోజ్-డి



బ్రిటానియా గ్లూకోజ్-డి బిస్కట్లతో పాటు మరో ప్రముఖ బ్రాండ్ గ్లూకోజ్ బిస్కట్లను పోల్చి చూసేందుకు చేసిన పరీక్షల వలన తేలిందేమిటంటే: విటమిన్లు మరియు మొత్తం మీద పుష్టినిచ్చే పదార్థాలు గ్లూకోజ్-డిలో ఎక్కువగా ఉన్నాయని. అంతేగాక రుచికోసం, తియ్యదనం కోసం, కరకరలాడే తనానికి దీనివి కావాలంటారని. శక్తినిచ్చే విషయంలో, గ్లూకోజ్ కన్న గ్లూకోజ్ డి 20% ఎక్కువ శక్తినిస్తుంది! <u>బ్రిటానియా గ్లూకోజ్-డి-తియ్యటి రుచితో కూడిన శక్తి</u>!




అందుకే మరి ఏ ఇతర గ్లూకోజ్ బిస్కట్ కన్న బ్రిటానియా గ్లూకోజ్-డి అంటేనే ఎక్కువ మంది ఆకర్షితులవుతున్నారు.

బ్రిటానియా — బ్రిటానియా బిస్కట్లు అత్యుత్తమమైనవి



'దూడా బసవన్న'లో చలం, అంజలి

### ప్రాతికేయుల స్నేహవాత్సల్యాలు

తన చిత్రాలకు పాత్రికేయులు బహుళ ప్రచారం యిస్తున్నందుకు, తనపట్ల స్నేహ వాత్సల్యాలను ప్రదర్శిస్తున్నందుకు, శ్రీ నాయుడు ఆనందాన్ని వ్యక్తపరుస్తూ, పాత్రికేయులను కుటుంబ సభ్యులుగా పరిగణిస్తున్నట్టు ఆయన చెప్పారు. జిల్లాలవారీ అమ్మకం వచ్చి, పరిశ్రమకు పెద్ద ముప్పును తెచ్చిపెట్టిందని...కొనుగోలుదార్ల ఫ్యాన్సీ ప్రైస్ మార్కెట్ ధరలను ఘనంగా పెంచి... చిత్ర నిర్మాణపు ఖర్చును అమాంతంగా పెరగడానికి దోహదం చేసిందని శ్రీ నాయుడు తన బాధను వ్యక్తపరుస్తూ... యీ విషజ్వరం తగ్గాలంటే... ఎవరికివారు సరయిన నిర్ణయం తీసుకోవాలని ఆశించారు.

### హిందీలో "జీవనతరంగాలు"

శ్రీ నాగేశ్వరరావు నిర్మించిన అన్నపూర్ణా స్టుడియోస్ "సెక్రటరీ" చిత్రంతో ప్రారంభమయినట్టే... "జీవనతరంగాలు" హిందీ చిత్రాన్ని అక్కడే ప్రారంభించినట్టు సురేష్ అధినేత తన సెంటిమెంటును వ్యక్తీకరించారు.

మూడు సంవత్సరాలకు సరిపడే కథలు తన దగ్గర వుండడంవల్ల... అన్వేషణ ప్రశ్న తనకు వుదయించదని శ్రీ నాయుడు చెప్పారు.

[ "శాంతినికేతన్... డాక్టర్ అరుణ... ఒక చల్లని రాత్రి... దేశంకోసం" గాక గుహనాథన్ వ్రాసిన రెండు కథలు. ]

సంవత్సరానికి రెండు చిత్రాలు తెలుగులో... అవి విజయాన్ని సాధిస్తే... హిందీ... తమిళ భాషల్లో నిర్మించడాన్ని తన ధ్యేయంగా శ్రీ నాయుడు వెల్లడించారు.

జనవరి 11న విడుదలయ్యే "శిరిషి కృష్ణుడు" అన్ని తరగతులవారినీ ఆకర్షించ గలదన్న నమ్మకాన్ని శ్రీ రామానాయుడు వ్యక్త పరచారు.

## సినిమా

### వేషం కోసం వేచిన అతివ

కొత్త నటీనటుల కోసం అన్వేషిస్తున్న దర్శక... నిర్మాతలు యిక్కడ పరిచయం అవుతున్న రమాదేవిని తమ చిత్రాలకు ఎంపిక చెయ్యొచ్చు.

ఈమెకు దేవుడు అవయవసౌష్ఠవాన్ని వరంగా ప్రసాదించాడు. ఈమెకు నాటకాల్లో అనుభవం వుండడంమూలంగా... "నటన"లో నెగ్గగలదు

"నటన"తోబాటు సరిపెట్టుకోక చిన్న మాష్టర్ దగ్గర నృత్యంలో పాఠాలు నేర్చుకుంటూ వుంది.

"లంకా క్షేత్రం... మారిన మనుషులు" నాటకాలలో ముఖ్య పాత్రలను పోషించిన రమాదేవికి శ్రీ దాసరి "కన్య...కుమారి" చిత్రంలో ఒక చిన్న పాత్ర నిచ్చారు. ఇప్పుడీమె మారుతీ కంబైన్స్‌వారి "అల్లరి_బుల్లోడు" చిత్రంలో ఒక సహాయ పాత్రను పోషిస్తున్నది.

మీకు ఎలాంటి పాత్రలంటే యిష్టం అని అడిగాను. "వాంప్ అయినా... హాస్యమైనా, శోకమైనా, ఏదైనా చెయ్యడానికి సిద్ధమే" అంది అవకాశాల కోసం ఎదురు చూస్తున్న సంపులపూబోణి... రమాదేవి.

ఈమెది విజయవాడ అని, హేర్ స్పెషలిస్టు శ్రీ భాస్కరరావు సినిమా రంగానికి తీసుకొచ్చారని తెలిసింది.

—శ్రీనివాస్ ★

కొత్తనటి రమాదేవి



# ధ్రువతార చార్లీ చాప్లిన్

సినిమా రంగంలో ఎవ్వరూ తెచ్చుకోలేనంత పేరును తెచ్చుకుని;నటుడు, నిర్మాత, దర్శకుడు, సంగీత దర్శకుడుగా ఎవ్వరు చేయనంత సేవ చేసిన శ్రీ చార్లీచాప్లిన్ తన 88వ ఏట 1977 డిశంబరు 25వ తేదీన కన్నుమూశాడు.

శ్రీ చార్లీచాప్లిన్ లండన్‌లో 1889లో మురికివాడలో ఒక పేద కుటుంబంలో జన్మించాడు. 1910లో నాటక రంగంలో ప్రవేశించాడు. 1913లో చిత్ర రంగంలో ప్రవేశించాడు. చిన్న ఫ్రెంచ్‌కట్టు మీసం, కార్టూన్ బొమ్మలా వుండే రూపం, అమాయకంగా వుండే కళ్ళు, చిరిగిపోయిన బూట్లు, వదులు దుస్తులతో ఆయన సృష్టించిన 'ట్రాంప్' పాత్ర అందరికీ తెల్సు. మోడరన్ టైమ్స్, గోల్డ్‌రష్, ది లైమ్‌లైట్, ఏ 'కింగ్' ఇన్ న్యూయార్క్ శ్రీ చాప్లిన్ నిర్మించిన గొప్ప చిత్రాలలో కొన్ని మాత్రమే.

1975లో ఎలిజబెత్‌రాణి బకింగ్‌హామ్ పాలెస్‌లో జరిగిన ఒక ఉత్సవంలో 'సర్' బిరుదు నిచ్చి ఆయనను గౌరవించారు. శ్రీ చాప్లిన్ చివరి క్షణాలు ప్రశాంతంగా గడిచిపోయాయి. సినిమా లోకంలో ఆయన ధ్రువతారగా వెలుగుతూనే వుంటాడు!

— ప్రసాద్

# 1977లో విడుదలైన తెలుగు చిత్రాలు

''సంసారంలో సరిగమలు'' సంగీతం శంకర్ గణేశ్ దర్శకత్వం ఎం ఎస్ కోటారెడ్డి
''ఎర్రసీమ'' సంగీతం కె వి మహదేవన్ దర్శకత్వం పి చంద్రశేఖరరెడ్డి
''లక్ష్మీ నిర్దోషి'' సంగీతం ఎం ఎస్ విశ్వనాథన్ దర్శక నిర్మాత శ్రీధర్
''దాన వీర శూర కర్ణ'' సంగీతం పెండ్యాల దర్శక నిర్మాత ఎన్ టి రామారావు (వర్ణచిత్రం)
''కురుక్షేత్రం'' (సినిమాస్కోప్) సంగీతం ఎస్ రాజేశ్వరరావు దర్శకత్వం కమలాకర కామేశ్వర రావు (వర్ణ చిత్రం)
''అత్తవారిల్లు'' సంగీతం. టి చలపతి రావు దర్శకత్వం · ప్రత్యగాత్మ
''రంభ ఊర్వశి మేనక'' సంగీతం చక్రవర్తి దర్శకత్వం పి సాంబశివరావు.
''చక్రధారి'' సంగీతం. జి కె. వెంకటేశ్ దర్శకత్వం వి మధుసూదనరావు (వర్ణచిత్రం)
''ఈతరం మనిషి'' సంగీతం చక్రవర్తి దర్శకత్వం వి మధు సూదనరావు (వర్ణ చిత్రం.)
''సాహసగాళ్ళు'' సంగీతం జె.వి రాఘవులు. దర్శకత్వం బోయిన సుబ్బారావు. (వర్ణ చిత్రం.)
''జడ్జిగారి కోడలు.'' సంగీతం· మహదేవన్ దర్శకత్వం వి మధుసూదనరావు
''స్వర్గానికి నిచ్చెనలు'' సంగీతం· మహదేవన్ దర్శకత్వం ఎస్ గోపాలకృష్ణ
''ముత్యాలపల్లకి'' సంగీతం సత్యం దర్శకత్వం బి వి ప్రసాద్ (వర్ణ చిత్రం)
''చిల్లరదేవుళ్లు'' సంగీతం మహదేవన్ దర్శకత్వం టి. మాధవరావు
''ఆలుమగలు'' సంగీతం తాతినేని చలపతిరావు దర్శకత్వం తాతినేని రామారావు (వర్ణ చిత్రం)
''సీత గీత దాటితే'' సంగీతం మహదేవన్ దర్శకత్వం శ్రీధర్
''సీతారామ వనవాసం'' సంగీతం. మహదేవన్ దర్శకత్వం కె కామేశ్వరరావు (వర్ణ చిత్రం)
''జరుగుతున్న కథ'' సంగీతం సత్యం దర్శకత్వం జి శేషగిరిరావు.
''మనవడికోసం'' సంగీతం, దర్శకత్వం భానుమతీ రామకృష్ణ
''స్నేహం'' సంగీతం మహదేవన్ దర్శకత్వం బాపు (వర్ణ చిత్రం.)
''బంగారు బొమ్మలు'' సంగీతం మహదేవన్ దర్శక నిర్మాత వి బి రాజేంద్ర ప్రసాద్ (వర్ణ చిత్రం)
''కల్పన'' సంగీతం · చక్రవర్తి. దర్శకత్వం కె రాఘవేంద్రరావు
''అడవిరాముడు'' (సినిమాస్కోప్) సంగీతం మహదేవన్ దర్శకత్వం కె రాఘవేంద్రరావు (వర్ణ చిత్రం)

''అందమె ఆనందం'' సంగీతం సత్యం దర్శకత్వం సింగీతం శ్రీనివాసరావు (వర్ణచిత్రం)
''బ్రతుకే ఒక పండుగ'' సంగీతం మహదేవన్ దర్శకత్వం పి చంద్రశేఖరరెడ్డి (వర్ణ చిత్రం.)
''కన్య కుమారి'' సంగీతం ఎస్ పి బాలసుబ్రహ్మణ్యం దర్శకత్వం దాసరి నారాయణరావు (వర్ణ చిత్రం)
''జీవితనౌక.'' సంగీతం మహదేవన్ దర్శకత్వం కె విశ్వనాథ్. (వర్ణ చిత్రం)
''మా బంగారక్క'' సంగీతం, మహదేవన్ దర్శకత్వం దాసరి నారాయణరావు
''సీతమ్మ సంతానం'' సంగీతం సత్యం దర్శకత్వం కె ఎస్ రెడ్డి
''ప్రేమించి పెళ్లి చేసుకో'' సంగీతం సత్యం దర్శకత్వం · కె. హేమాంబరధరరావు
''ఈ నాటి బంధం ఏనాటిదో'' సంగీతం ఎస్ రాజేశ్వరరావు దర్శకత్వం కె ఎస్ ఆర్ దాస్ (వర్ణ చిత్రం)
''గీత — సంగీత'' సంగీతం శంకర్ గణేశ్ దర్శకత్వం ఎం ఎస్ కోటారెడ్డి
''ఒకే రక్తం'' సంగీతం సత్యం దర్శకత్వం. పి చంద్రశేఖరరెడ్డి.
''ఓ మనిషీ తిరిగిచూడు'' సంగీతం రమేష్ నాయుడు దర్శకత్వం దాసరి నారాయణరావు.
''మంచిరోజు'' సంగీతం, దర్శకత్వం, నిర్మాత. శ్రీరామ్.
''రాజారమేష్.'' సంగీతం. మహదేవన్ దర్శకత్వం. వి. మధుసూదనరావు (వర్ణ చిత్రం)
''ఎదురీత.'' సంగీతం · సత్యం దర్శకత్వం వి మధుసూదనరావు (వర్ణ చిత్రం)
''జన్మ జన్మల బంధం'' సంగీతం మహదేవన్ దర్శకత్వం పి చంద్రశేఖరరెడ్డి (వర్ణ చిత్రం)
''ఇదెక్కడి న్యాయం'' సంగీతం ఎస్ రాజేశ్వరరావు దర్శకత్వం దాసరి నారాయణరావు
''మహానుభావుడు'' సంగీతం టి చలపతి రావు దర్శక నిర్మాత · కె హేమాంబరధరరావు
''ఊరుమ్మడి బతుకులు'' సంగీతం ఎం బి శ్రీనివాస్ దర్శకత్వం. బి. ఎస్ నారాయణ (వర్ణచిత్రం)
''జీవనతీరాలు'' సంగీతం చక్రవర్తి దర్శకత్వం జి సి శేఖర్ (వర్ణచిత్రం)
''చిలకమ్మ చెప్పింది'' సంగీతం ఎం ఎస్ విశ్వనాథం దర్శకత్వం ఈరంకి శర్మ
''జీవితమే ఒక నాటకం'' సంగీతం రమేష్‌నాయుడు దర్శకత్వం.దాసరి నారాయణరావు
''చాణక్య—చంద్రగుప్త'' సంగీతం పెండ్యాల. దర్శక నిర్మాత ఎన్ టి రామారావు (వర్ణచిత్రం)
''పంచాయితి'' సంగీతం. మహదేవన్ దర్శకత్వం విజయనిర్మల (వర్ణచిత్రం)

''ప్రేమలేఖలు'' సంగీతం సత్యం దర్శకత్వం కె రాఘవేంద్రరావు
''జీవితంలో వసంతం'' సంగీతం చక్రవర్తి దర్శకత్వం యు ఎస్ వి పాణి
''ఖైదీకాళిదాసు'' సంగీతం చక్రవర్తి దర్శకత్వం పి సుబ్రహ్మణ్యం (వర్ణచిత్రం)
''భద్రకాళి'' సంగీతం ఇళయరాజా దర్శకత్వం ఎ సి త్రిలోక్‌చందర్
''మాఇద్దరికథ'' సంగీతం చక్రవర్తి దర్శకత్వం నందమూరి రమేష్ (వర్ణచిత్రం)
''దొంగలకు దొంగ'' సంగీతం సత్యం దర్శకత్వం కె ఎస్ ఆర్.దాస్ (వర్ణచిత్రం)
''అమరదీపం'' సంగీతం సత్యం దర్శకత్వం కె రాఘవేంద్రరావు (వర్ణచిత్రం)
''చిల్లరకొట్టు చిట్టెమ్మ.'' సంగీతం రమేష్‌నాయుడు దర్శకత్వం దాసరి నారాయణ రావు (వర్ణచిత్రం)
''పెళ్ళికానిపెళ్ళి'' సంగీతం సత్యం దర్శక నిర్మాత ఆదిరాజు ఆనందమోహన్ (వర్ణచిత్రం)
''గడుసు అమ్మాయి'' సంగీతం టి చలపతి రావు దర్శకత్వం ప్రత్యగాత్మ.
''భలే అల్లుడు'' సంగీతం రాఘవులు దర్శకత్వం · పి. చంద్రశేఖరరెడ్డి (వర్ణ చిత్రం)
''మనుషులు చేసిన దొంగలు'' సంగీతం సత్యం దర్శకత్వం ఎం మల్లికార్జునరావు (వర్ణ చిత్రం)
''యమగోల'' సంగీతం చక్రవర్తి దర్శకత్వం తాతినేని రామారావు (వర్ణ చిత్రం)
''అర్ధాంగి'' సంగీతం టి చలపతిరావు దర్శకత్వం మోహన్‌గాంధి
''వస్తాడే మా బావ'' సంగీతం ఘంటసాల విజయకుమార్ దర్శక నిర్మాత టి గోపాలకృష్ణ
''గంగ-యమున సరస్వతి'' సంగీతం చక్రవర్తి దర్శక నిర్మాత మహేష్
''తరం మారింది'' సంగీతం జి కె వెంకటేశ్. దర్శకత్వం సింగీతం శ్రీనివాసరావు
''దుడుకుపిల్లోడు'' సంగీతం మహదేవన్ దర్శకత్వం కె బాపయ్య (వర్ణ చిత్రం.)
''తొలిరేయి గడిచింది'' సంగీతం సత్యం దర్శకత్వం కె ఎస్ రామిరెడ్డి
''ఆమె కథ'' సంగీతం చక్రవర్తి దర్శకత్వం కె రాఘవేంద్రరావు.
''ఆత్మీయుడు'' సంగీతం జె వి రాఘవులు దర్శకత్వం. తాతినేని రామారావు (వర్ణ చిత్రం)
''మనస్సాక్షి'' సంగీతం. జె వి రాఘవులు దర్శకత్వం పి సాంబశివరావు
''మొరటోడు'' సంగీతం. ఎం ఎస్ విశ్వనాథన్ దర్శకత్వం నాగేష్ (వర్ణ చిత్రం)
''చరిత్రహీనులు'' సంగీతం చక్రవర్తి. దర్శకత్వం కె బాపయ్య
''దేవతలారా దీవించండి'' (సినిమాస్కోప్) సంగీతం చక్రవర్తి దర్శకత్వం కొమ్మినేని శేషగిరిరావు

—జి. వి. జి.

## ప్రశ్నావళి  —కె. రామలక్ష్మి

ఎ జె బి ఆర్ — ధర్మవరం

నేనిటువంటి ప్రశ్న వేస్తున్నందుకు తమాషాగా భావించకండి. తాననుకున్నది సాధించలేకపోతే యిక ఈ లోకములో జీవించడం వృధా! మీరు ఏమంటారు?

★ ఈ లోకంలో వృధా అని పోయినవాళ్లని ఆ లోకంలో — రంభాదులు గౌరవంగా ఆహ్వానిస్తారా — అని!

పి. ఎల్ కె — కొవ్వూరు

స్త్రీ శక్తి స్వరూపిణి అంటారే మరి పురుషుడు?

★ శక్తిలేక శివుడు లేడు! అంతే మరి

పి ఎస్. ఆర్. — కొవ్వూరు

ఇల్లు ఇరకటం ఆలి మరకటం అంటే ..

★ ఇంకా యింటి బాధ వేరే చెప్పక్కర లేదని! చాలీచాలని యింట్లో పనిమంతురాలుగాని ఇల్లాలుంటే — యింకా ఇంట గందరగోళం గజిబిజి ఎవరూ వూహించలేరని

బి. ఎస్. ఆర్. — బొంబాయి

మగవాడు ఏడిస్తే ఆడది నవ్వితే నమ్మద్దంటారు అలా అయితే జీవితంలో మగవాడు ఏడ్వడం ఆడవారు నవ్వడం జరగని పనా? యిలా ఎందుకంటారో, అసలందులోని నిగూఢార్థం ఏమిటో సెలవిస్తారా?

★ బాబోయ్ యిలాంటి ప్రశ్నకి జవాబెలా చెప్పాలో నాకు తెలియదండీ, ఇన్నాళ్ళూ, ఆడది నవ్వితే చూడలేక, మగవాడు ఏడిస్తే ఓదార్చలేకా అలా అన్నారేమో అనుకునేదాన్ని ఇక దీనికో నిగూఢార్థం, దీని చరిత్ర పుట్టుపూర్వోత్తరాలూ నేనెక్కడ తవ్వేదాను?! తల్చుకుంటే నే ఏడుపొస్తుంది బాబూ.

కె జి పి ఆర్ — రాయగడ

కళ ఎందుకూ?

★ మనిషిలోని జంతువుకి 'పాలిష్' యివ్వడంకోసం

ఆడవాళ్లు చదివి ఉద్యోగాలు చేయబట్టే నిరుద్యోగ సమస్య యిలా పెరిగిపోయిందనేవాళ్లు మీకెప్పుడైనా తటస్థించారా!

★ వాళ్ల సంఖ్యే ఎక్కువగా వున్నప్పుడు — తటస్థించకుండా ఎలా వుంటారు! అయినా వీళ్లంతా — ఆడదికూడా సాటి వ్యక్తి అనుకుంటే— యిలాంటి చౌకబారు స్టేట్‌మెంట్లు పారేసి వుండరుకదా అనుకుంటాను!

ఎస్ పి ఆర్. — పర్లాకిమిడి

మేమిద్దరం పరస్పరం హృదయపూర్వకంగా ప్రేమించుకున్నాం హద్దులుమీరి ప్రవర్తించాము ఫలితం

★ మరి అంతేకద! అయినా నిజంగా ప్రేమించుకున్నవాళ్లకి — ఒకరిపై ఒకరికి వాంఛ వున్నా గౌరవం కూడా వుంటుంది. అందుకే పెళ్లి అనేది ఒక 'గోల్'గా పెట్టుకుని హద్దుల్లో వుంటారు ఉట్టి మోహావేశాన్ని ప్రేమగా భ్రమించి యిలా ప్రవర్తించి ముప్పు తెచ్చుకుని — ఒకరినొకరు నిందించుకుంటూ కూర్చోడంలో అర్థంలేదు

జె. బి. హెచ్. ఆర్ — రుద్రారం

బ్రతకడానికి దారిచూపలేని డిగ్రీలు ఎందుకు పనికివస్తాయి?

★ కట్నం రేటు పెంచడానికి అబ్బాయిలకి, కట్నం రేటు పెంచడానికే — అమ్మాయిలకీ!

కె. ఎస్ బి. — గిద్దలూరు

మీ దారితప్పిన తండ్రిలో అన్నపూర్ణమ్మగారు తన భర్తను కాల్చి చంపడం ఎంతో సమంజసంగా వుంది. ఆ సమయంలో ఆమె ఫీలింగ్స్ ఇంకొంచెం వివరించివుంటే బాగుండేది.

### ఊహలు - ఉల్కలు!

కొన్ని యోజనాల దూరం
నీకూ నాకూ మధ్య
మనసుకూ ఉనికికీ మధ్య
మిధ్యగా తోచే
సచేతనాలోచన
ఎప్పటికప్పుడు
మనసు విరిగి
శకలాలుగా చెదరి
మిగిలిన శూన్యం
ఎప్పటి కప్పుడు
వలపు తరిగి
మనలను
చీల్చినట్లు
అనుభవం
అంతలోనే
అంతరం శూన్యమై
నీకూ నాకూ మధ్య
అభావం నిర్మూలమై
మనస్ను ఏకం చేస్తూ
ఊహలు!
ఉల్కలు!
హిమసుమాలు!

— వాణి రంగారావు

★ కాని నవల దెబ్బతినేది — సాగదీస్తే! అప్పుడు మీరే అనేవారు ... విసిగించిందని కొన్ని సంఘటనలలో పాత్రల మనస్సులో ఆలోచనలు — మెరుపుల్లా మెరిసి మాయమై పోతాయి అవి చిత్రీకరణలో మాండేజెస్‌గా రక్తికట్టుతాయేగాని రచనలో సోదిగా తయారవుతాయి — కారణం ఒక్కటే — ఒకొక్క మాండేజ్ వెనకా ఓ బుల్లి సంఘటన రాయాలి! మీకా నవల నచ్చినందుకు థాంక్సు

కె. జె ఆర్. — గొర్రాజు చీపురపల్లి

ఈ సంవత్సరం ఆగస్టు 15న కాంగ్రెసు జెండా ఎగురవేస్తారా? జనతా జెండా ఎగురవేస్తారా?

★ రెండూ కాదు నేషనల్ ఫ్లాగ్ ఎగరేస్తారు — ఎప్పుడూ

ఎమ్. ఎస్ ఆర్. — ఏలేటిపాడు

ఆడవాళ్ల మనస్తత్వాలు తెలుసుకోవాలంటే సులభ మార్గమేది?

★ వాళ్ళూ మీలాంటి మనుషులన్న ఒక్క సత్యం గుర్తుపెట్టుకుని వింటే చాలు — అర్థంకావడానికి.

ఆర్. ఎస్. బి. — నేలకొండపల్లి

ఆడదాని జీవితం అరిటాకుతో పోలుస్తారు కారణం?

★ తన తప్పులకే కాకుండా పైవాళ్ల తప్పులకు కూడా తానే నాశనంఅయే అర్భకతత్వం తనలో యిముడ్చుకొని వుండడంవల్ల అలా పోల్చేవారు. కాని ఇప్పుడా పోలికకి అర్థంలేదు

సి. వి ఆర్. బిస్సాంపూరు.

కె రా. గారూ మేం ఒకరి నొకరం ప్రేమించుకొన్నాం. ఇంత ప్రేమ ఫలితం ఎలా వుంటుందంటారు?

★ మీరు ధైర్యం చేస్తే పెళ్లితో ముగుస్తుంది. మీరు జారుకుంటే-- ఇదీ చాలామంది ప్రేమ కథల్లాగే మరుగున పడిపోతుంది!

కె. ఆర్. ఎన్. మద్రాసు.

నాకు ముప్పయి సంవత్సరాలు ఒక కాలేజీ అమ్మాయిని చూసినాను ఆమె కూడా పోవునప్పుడు నన్ను చూసినది నా కంటే పదకొండు సంవత్సరాలు చిన్నది

★ వయస్సుకీ బుద్ధికీ సంబంధం లేదని మీగోడు చెప్పక చెప్తోంది స్వామీ! ముప్పయ్యేళ్లు రాగానే సరా?! అమ్మాయి చూసినంత మాత్రాన ప్రేమించిందనుకోవడం, పెళ్లి చేసుకోవాలనుకోడం, వయస్సు తేడావల్ల ఏమైనా యిబ్బందులున్నాయా, వస్తాయా! అనుకోవడం... యివన్నీ మిల్క్‌మైడ్స్ డ్రీమ్స్‌లాగా వుంది! కాస్త వయస్సులోనే కాక మనసులో కూడా పెరుగుదలకి ప్రయత్నించండి!

వి ఎస్ డి నెల్లూరు

యువతి మేను (అంటే ఛాతీ) మరియు నాభి కిందకు వస్త్రధారణ చూడటానికి అసహ్యంగా జుగుప్సాకరంగా వుంది తెలుగు ఆడబడుచు కట్టుబొట్టు ఇదా

★ పోనీ కాదనుకుందాం మరి ఏది తెలుగింట కట్టు?! బొట్టు?!.. (మనలోమనమాట సాటిస్త్రీ కట్టూ బొట్టూ వరసా— సాటి స్త్రీకి యిలాగే డోకుగా వుంటాయిలే— చిట్టితల్లీ! ఆడపిల్లలు అందంగా అలంకరించుకొనేది — ఆడాళ్ల మెప్పుకోసం కాదు! అంతే

ఎమ్ వి కె. తిరుపతి.

దుఃఖం వైదొలగనప్పుడు...మార్గంఏమిటి?

★ దుఃఖం వైదొలక్కపోవడం ఏమిటి? అది ఎప్పుడూ క్షణికమైన బాధ. దానిని ముద్దుగా పెంచుకుంటూ పోతే... జీవితాంతం అనుభవించవలసిన పొరపాటై కూర్చుంటుంది. అందుకే దుఃఖాన్ని మర్చిపోవాలి.




## రా గ మా లి క

[24 వ పేజీ తరువాయి]

జాలే కలిగిందో ఒక శుభము హూర్తాన రాధని తీసుకుని తండ్రి దగ్గిరికి బయల్దేరాడు

ఆరేడేళ్ల తరువాత రాధ తండ్రిని చూడబోతోంది ఎంతో ఉత్సాహంగావుంది రాధకి అప్పట్నించి రాధపరిస్థితి కాస్త మెరుగ్గావుందిఅనవచ్చు

'నాన్నా!' ఒక్కంగలో వెళ్లి తండ్రిని కౌగిలించుకుంది రాధ—బండి దిగగానే ఒరేడేళ్లకే ఎంతో వృద్ధుడైనట్లుగా వున్నాడు రాధ తండ్రి

రాధ నట్లాగే తెల్లబోయి చూశాడు కొన్ని క్షణాలు తరువాత. "నా తల్లీ... రాధా..." అంటూ వళ్లంతా నిమురుతూ వలవలా ఏడిచాడు పక్కనే ఆరేళ్ల పిల్లవాడు అంతా వింతగా చూస్తున్నాడు. ఈ సందడికి లోపల్నించి రాధ సవతి తల్లి వచ్చింది. చాలా మర్యాదగా మాట్లాడింది. రాధని లోపలికి తీసికెళ్లింది. కాఫీ యిచ్చింది. రాధకీ—మేనమామకీను 'అక్కయ్యరా!' అని చెప్పింది పిల్లవాడితో. స్నానం—భోజనం అయ్యాక వెళ్లిపోయాడు రాధ మేనమామ. రాధ కధంతా ఆయనే మూడు ముక్కల్లో చెప్పి తప్పుకున్నాడు. సవతితల్లీ—తండ్రీ చాలా బాధ పడ్డారు రాధ పరిస్థితికి

సవతితల్లి బాగానే చూసేది రాధని మొగుడి దెబ్బలకన్నా—మేనమామల కృత్రిమ అప్యాయతకన్నా—మేనమామల భార్యల నూటి పోటీ మాటలకన్నా—అవహేళనలకన్నా—వాళ్ల పిల్లల వెకిలి వేషాలకన్నా—తమ్ముడి ఆపేక్ష—తండ్రి ప్రేమ—సవతితల్లి చేయించే పనులు ఎంతో హాయిగా వున్నాయి రాధకి కొన్ని విషయాలు పట్టించుకోకుండా ముభావంగా వున్నా—పైకి కనబడనీయదు సవతితల్లి తండ్రి ఆస్తిలో సగభాగం తను తీసుకున్నదనే దుగ్ధ సవతితల్లికి వుండడం న్యాయమే కదా? మళ్లీ తను ఆవిడపాలే పడ్డదాయె! ఆస్తిలో తనకెంత దక్కిందో కూడా ఆవిడకి తెలీదుకదా? నవ్వుకునేది రాధ

తమ్ముడు రవి మాత్రం—'అక్కా—అక్కా' అంటూ తన వెనకే తిరిగేవాడు [ఇంకా వుంది]

# వారఫలం

— మహేష్ —

**20-1-1978 శుక్రవారం మొదలు 26-1-1978 గురువారం వరకు**

**మేషం:—** వ్యాపార విస్తరణ ప్రయత్నాలు బాగుంటాయి. మిత్రులకు సహాయం చేస్తారు. సాహసిక వ్యవహారాలు లాభిస్తాయి. వారం ఆఖరులో మీ మంచితనమే మీకు ఇబ్బందిని కలిగిస్తుంది. స్థిరాస్తి వ్యవహారాలు బాగుంటాయి. స్త్రీలకు— సంతోషకరమైన సమాచారం అందుతుంది. దైవ కార్యాలు నెరవేరతాయి.

**వృషభం:—** మీ ఆలోచనలు ఫలిస్తాయి. వ్యాపారంలో ముఖ్యమైన వ్యక్తులను కల్సుకొంటారు. రావలసిన డబ్బు అందుతుంది. వృత్తిలో పోటీవారి పోటీ తగ్గుతుంది. అధికారుల వలన జరగవలసిన వ్యవహారాలు బాగుంటాయి. స్త్రీలకు— ఆరోగ్యం బాగుంటుంది. సాహిత్య కళారంగాల్లో ఖ్యాతి లభిస్తుంది.

**మిధునం:—** వృత్తి వ్యాపారాలు బాగుంటాయి. ఉద్యోగంలో గౌరవం లభించగలదు. మీ ప్రయత్నాలు ఫలిస్తాయి. ప్రయోజనం గల సంభాషణలను జరుపగలరు. శుభకార్యాల విషయంలో అభివృద్ధిని సాధిస్తారు. స్త్రీలకు— కుటుంబ వ్యవహారాలు బాగుంటాయి. వినోద కాలక్షేపాల్లో పాల్గొంటారు.

**కర్కాటకం:—** మీతాలూకు మనుష్యులే మిమ్మల్ని వ్యతిరేకిస్తారు. ప్రయాణాల్లో శ్రమ కలుగుతుంది. చికాకులకు గురి కాగలరు వారం ఆఖరులో మీ కార్యక్రమాలు అనుకూలంగా ఉంటాయి. వ్యాపారంలో నూతనావకాశాలు లభిస్తాయి. స్త్రీలకు— ఆరోగ్యం బాగుండదు. బంధుమిత్రులను కల్సుకొంటారు.

**సింహం:—** వృత్తిలో ఆదాయం పెరుగుతుంది. సాహసిక వ్యవహారాలు బాగుంటాయి. విద్యా వైజ్ఞానిక రంగాల్లో ఖ్యాతి లభిస్తుంది. వారం ఆఖరులో ప్రయాణ కలుగుతుంది. చేజిక్కినఅవకాశాలు కూడా జారిపోవచ్చును. స్త్రీలకు — కుటుంబ వ్యవహారాల్లో చికాకులు ఏర్పడతాయి. సంతానానికి సౌఖ్య సంతోషాలు లభిస్తాయి.

**కన్య:—** అధికారులవలన జరగవలసిన వ్యవహారాలు బాగుంటాయి. సజ్జన సాంగత్యం లభిస్తుంది. ఉద్యోగంలో గౌరవం బాగుంటుంది వ్యాపారంలో మీ ప్రయత్నాలు ఫలిస్తాయి. రావలసిన డబ్బు అందగలదు. స్త్రీలకు—ఆరోగ్యం బాగుంటుంది. శుభకార్యాల విషయంలో అనుకూలత లభిస్తుంది.

**తుల:—** మీ కార్యక్రమాలు బాగుంటాయి. సాహిత్య కళా రంగాల్లో ఖ్యాతి లభిస్తుంది. మిత్రులకు సహాయం చేస్తారు. ప్రయోజనంగల పరిచయాలు ఏర్పడతాయి. స్థిరాస్తి వ్యవహారాలు బాగుంటాయి. స్త్రీలకు— వినోద కాలక్షేపాల్లో పాల్గొంటారు. ప్రయాణాలోచనలు చేస్తారు.

**వృశ్చికం:—** సాహసిక వ్యవహారాల్లో నష్టం రాగలదు. ఉద్యోగంలో కార్యభారం పెరుగుతుంది. ఆందోళనకు గురి కాగలరు. వారం ఆఖరులో మీ కార్యక్రమాలు బాగుంటాయి. రావలసిన డబ్బు సమయానికి అందుతుంది స్త్రీలకు— ఆరోగ్యం బాగుండదు. అలంకార వస్తువులు కొంటారు.

**ధనుస్సు:—** ప్రయోజనంగల పరిచయాలు ఏర్పడతాయి. రావలసిన డబ్బు అందుతుంది. పోటీవారిలో గౌరవం బాగుంటుంది. వారం ఆఖరులో ఫలితంలేని శ్రమ కలుగుతుంది. వృత్తిలో ఎవరినీ విశేషంగా నమ్మడం తగదు. స్త్రీలకు— కుటుంబ వ్యవహారాలు బాగుంటాయి. అనవసరమైన వ్యయం జరుగుతుంది.

**మకరం:—** అనవసరమైన సందేహాలు కలుగుతాయి. వ్యాపారంలో శ్రమమీద అనుకూలత లభిస్తుంది. ప్రయాణాలు వాయిదా పడతాయి. భాగస్వాములతో కలసిచేసే వ్యాపారాలు బాగుంటాయి. ఉద్యోగంలో గౌరవం లభిస్తుంది. స్త్రీలకు— ఆరోగ్యం బాగుంటుంది. ఎవరితోను వాద ప్రతివాదాలు తగవు.

**కుంభం:—** వ్యాపారంలో మీ ప్రయత్నాలు ఫలిస్తాయి. సాహసిక వ్యవహారాలు బాగుంటాయి. మిత్రుల సహాయం లభిస్తుంది. రాజకీయ వ్యవహారాల్లో చికాకుల ఏర్పడతాయి. ఇతరుల నిమిత్తం శ్రమ పొందవలసి వస్తుంది. స్త్రీలకు — సాహిత్య కళారంగాల్లో ఖ్యాతి లభిస్తుంది. పుణ్యకార్యాలు చేస్తారు.

**మీనం:—** మీ కార్యక్రమాలు హడావుడిగా ఉంటాయి. ప్రయాణాల వాయిదా పడతాయి. ఆర్థిక వ్యవహారాల్లో మొగమాటాలు తగవు. వృత్తిలో ఆదాయం బాగుంటుంది. విద్యా వైజ్ఞానిక రంగాల్లో మీ కృషి రాణించగలదు. స్త్రీలకు — ఆరోగ్యం బాగుంటుంది. బంధు మిత్రులను కల్సుకొంటారు.



# ఇప్పుడు! చురుకైన జీవనంకోసం శక్తినిచ్చే యింధనాన్ని సేవించండి.




# బూస్ట్

## మాల్ట్ చాకొలెట్ మిల్క్ డ్రింకు

రైలు మోస్తరుగానే మీకు కూడా ప్రతీ రోజు ఉత్సాహంగా ప్రారంభించేందుకు ఇంధనం కావాలి. అందుచేతనే ప్రతీ ఉదయం మీరు బూస్ట్ సేవించాలి.

మీరు చకచకా పనులు చేసుకొనడంలో మీకు తోడ్పడే శక్తిదాయకమైన ఇంధనం. ముఖ్యంగా పనిలోను, ఆటల్లోనూ అదనంగా శక్తిని వెచ్చించే మీ పిల్లలకు ఇది కావాలి.

వారికి బూస్ట్ యివ్వండి. ఇది మాల్ట్ చాకొలెట్ మిల్క్ డ్రింకు. పౌష్టికాహారం గురించి సంపూర్ణంగా తెలిసిన 'హార్లిక్స్' ఉత్పత్తిదారులు తయారు చేసింది.

సంపన్నమయిన క్రీమ్‌తో కూడిన బూస్ట్ మీకు మరింతగా శక్తినిస్తుంది. ఎందుచేతనంటే ఇది సంపూర్ణమయిన మీగడ పాలతోను, గోధుమతోను, బార్లీ మాల్ట్‌తోను, కోకోతోను తయారయింది.

బూస్ట్‌లో మీ పిల్లల పెరుగుదలకుగాను, ఇటువంటి మరే ఇతర చాకొలెట్ డ్రింకులోను లేనంత ఎక్కువగా పౌష్టిక పదార్థాలు ఉన్నాయి.

అంతేకాదు. బూస్ట్‌కి, మీ కుటుంబమంతా కూడా యిష్టపడే క్రీమ్ మాల్ట్ చాకొలెట్ రుచి, సువాసన ఉన్నాయి.

బూస్ట్, మీ రోజుని ప్రారంభించేందుకు ఖచ్చితమైన మార్గం—ప్రతీ రోజు.

రెండు సైజులలో లభిస్తుంది.

## 'హార్లిక్స్' ఉత్పత్తిదారులనుంచి.

B-4575-TEL

చెయ్యటమే మంచిది హి మ బి ం దు లో అందం హిమంలా కరిగిపోవచ్చుకాని శిలా సదృశమైన మనస్సు వుంది దానికో పొరు షమూ వుంది. ఒక మోహితానికాని ఒక శ్రీపతినికాని, మరో గిరిపతినికాని కాళ్ళా వేళ్ళా బడి ప్రాధేయపడి, దేవిరింపాల్సిన అవసరంలేదు ఒకరి జాలీ సానుభూతీ నా కక్కర్లేదు. భగవంతుడేదో తన కోరికలన్నీ

# పి. ఎ హిమబిందు

( 18వ పేజీ తరువాయి )

నెరవేరుస్తున్నట్టు కనిపించి ఆఖరున తిరిగి సర్దుకోలేని ఎదురుదెబ్బ తీయవచ్చుగాక అయినప్పటికి తన అభిమానం దెబ్బతినదు. తనాపూరుని వదలి వచ్చింది చివరికి గయలో సిద్ధార్థుడికి జ్ఞానం కలిగినట్టు తనకీ జ్ఞానోదయం కలగడం కోసమే! ఆయన మహానుభావుడు కనుక తమ కనుగొన్నది లోకంలో ప్రచారం కోసం తిరిగి వచ్చాడు. కాని తను సామాన్యురాలు తన జ్ఞానబోధలు ఎవరికీ అక్కర్లేదు

"శ్రీపతీ; నీ పట్ల నేను ప్రవర్తించిన వైఖరికి చాలా బాధపడుతున్నాను ఏదైనా తన దాకా వస్తేనే తప్పు ఏదీ అర్థం కాదు ఎవరికీని అందుకు నా బ్రతుకే వో వుదాహ రణ. కాలగర్భంలో నా అందం కలిసి పోయింది. ఎన్నడూ వెలికిరాని హృదయంలో నాగేటి సాగు జరిగి అంతర్గతమైన మానవత్వం వెలికి వచ్చింది అందం పోయేసరికి జాలి, కరుణ, అనే పదాలు చోటు చేసుకున్నాయి కాని అందువల్ల ఏమీ ప్రయోజనంలేదు సకాలంలో నీరందితేనే చేలు కళ కళ లాడేది అనావృష్టి అయినా, అతివృష్టి అయినా లాభం ఏముంది? పశ్చాత్తాపాన్ని మించిన ప్రాయశ్చిత్తం మరోటి లేదని, జీసస్, క్రైస్ట్, గౌతమ బుద్ధుడు గాంధీజీ వంటి మహాపురుషులు చెప్పింది నిజమే! అయితే నేను ఒక హృదయంతో గాదు, లక్ష హృదయాలతో పశ్చాత్తాపపడుతున్నాను అందుకా భగవంతుడు కనుక హర్షిస్తే మరో జన్మలో అందమైన రూపంతో బాటు అందమైన హృదయంకూడా ప్రసాదించమని ప్రార్థిస్తూ నేనీలోకంనించి నిష్క్రమిస్తున్నాను నీకూ, మాధవికి నా హృదయపూర్వకాభినందనలు,

హిమబిందు

ఆవుత్తరం చదివి కొయ్యబారి పోయాడు శ్రీపతి మరో రోజు గడిచేసరికి ఇంగ్లీషు పేపర్లో వెలువడిన వార్త చదివి నిలువునా షేద పడ్డారు మాధవి, శ్రీపతులు

మెట్రోపాలిటన్ మిల్లు మేనేజింగ్ డైరక్టరుగారి పి. ఏ. కుమారి హిమబిందు

ఓమ్మెల్లో జరిగిన అలజడిలో యాసిడ్ ప్రమాదానికి లోనై తన సౌందర్యం కోల్పోయి, అది దుర్భర వేదన కాగా ఆత్మహత్య చేసుకున్నందువ సంతాప సూచకంగా శ్రీ మెహతా ఈ రోజు మిల్స్ మూసి వేశారు. క్రింద స్పష్టంగా ఆమె ఫొటోతో పాటు వివరాలు కూడా వున్నాయి. అవన్నీ చదివి దీర్ఘనిశ్వాసం వదిలారు. లోపల రేడియో లోంచి ''జీనాయహా, మర్నాయహా ఇస్ కేసినా జానా కేహా'' అంటూ ముఖేష్ పాట విషాదంగా వినిపిస్తోంది.

(అయిపోయింది)

ఈ బ్రతుకిలాగా ఎన్నాళ్ళు? ఈ దారిద్ర్యానికి అంతం లేదా? ఈ ధంకి ఒక చివర లేదా? ఎప్పుడూ ఏ పూటకి ఆపూట దినదినగండం నూరేళ్ళాయుష్షు అన్నట్టుగానే గడపాలా? భగవాన్! దారిద్ర్యం అసహ్యించుకో తగ్గదికాదు. కానీ దాని అనుభవం మాత్రం భరించలేనిది అనుకున్నాడు శరత్.

ఆ ఉదయం భానుమతి యింట్లో అన్నీ నిండుకున్నాయని చెప్పినప్పటినుంచీ అతని మనస్సులో అలాటి ఆలోచనలే తిరుగుతున్నాయ్.

'నిరుపహతి స్థలంబు రమణీ ప్రియ దూతిక... యింకా ఏవేవో అడిగాడు అల నాడు తన శాఖీయుడు ఈ రోజు అవన్నీ అక్కర్లేదు కాస్త విశ్రాంతి — కొంచెం ఏకాంతం. కొంత మనశ్శాంతి దొరికితే చాలు. కధో, గేయమో, నవలో రాసుకో వచ్చు — కానీ యింటి యిల్లాలు ప్రాత స్సంధ్యావందనంలా కాఫీపొడి లేదు, పంచదార లేదు, పాలమ్మి డబ్బు అడుగు తోంది అంటూ ప్రారంభిస్తే యిక శాంతి ఎక్కడ? పేపర్పై పెన్నుపెట్టేదెలా?''

నిజానికి అతని మనస్సులో వేకువ జామునుంచీ మంచికధకి ప్లాటొకటి గింగిర్లు తిరుగుతూ వుంది. రాబోయే దీపావళి కధలపోటీకి ఏం రాయాలా అనుకుంటూ వుంటే చాలా చక్కని ప్లాట్ దొరికింది. ఓ రెండు గంటలు తీరిక దొరికితే ఎవరూ డిస్టర్బ్ చేయకపోతే కధ పూర్తవుతుంది. ఫెయిర్ చేయటానికి అంత కండీషన్స్ అక్కర్లే! భార్యతో మాటాడుతూ, కూతుర్ని నవ్విస్తూ, కొడుక్కి సమాధానం చెపుతూ, తల్లి తిట్లన్నీ దీవెనలా స్వీకరిస్తూ కూడా ఫెయిర్ చెయ్యొచ్చు. కానీ రాయటం అలాకాదే!

''బయటికి వెళ్లిరారా అబ్బాయ్ ఇక నేను వంట ప్రారంభించాలి మళ్ళీ ఆఫీసు టైమైందంటావు. నీతో గొడవ'' అంది టేబిల్పై వున్న గడియారాన్ని చూస్తూ సుబ్బమ్మగారు.

తల్లి మాటలు విని గడియారంకేసి చూశాడు శరత్. అదప్పుడే ఏడున్నర కావస్తోంది.

హైదరాబాదు స్టేషన్లో పాటలు మొదలయ్యాయి బయటనుంచి పరిగెత్తుకుని



# తారాబలం

యామినీ సరస్వతి



వచ్చి ట్యూన్ చేశాడు సుపుత్రుడు. రేడియో యథాశక్తి చిత్రహింస ప్రారంభించింది

తల విదిలించుకున్నాడు శరత్

'ఋణానందలహరి' అనుకున్నాడతను.

'ఇప్పుడు తనకి చిక్కబోయే ఎర ఎవరా?' అని ఆలోచించాడు. అందరికీ మూడోవారమే! అంతలో అతని మనస్సులో తన ఫ్రెండ్ కృష్ణమూర్తి గుర్తుకొచ్చాడు వాడు సెలవుల్లో వచ్చాడు డబ్బు ఎక్కువే వుండొచ్చు -అది అడిగితే సరి. ఎలాగూ వస్తుదాకా వుంటాడు" అనుకుని బయల్దేరబోయాడతడు

సరిగ్గా గడపదాటుతూవుండగా విరల్ వచ్చాడెదురుగా.

"రా! రా!" అని ఆహ్వానించి కూర్చున్నాడు అతన్ని కూచోబెట్టి.

ఇద్దరికీ సమానంగా కూచోటానికి చాపే గతి అయింది.

"ఎక్కడికి బయల్దేరుతున్నావు ?"

'మధ్యతరగతి మనిషి మార్గానికి'

'అంటే ?'

'చేబదుళ్ళకి."

ఫక్కున నవ్వాడు విరల్.

"ఒరే శరత్! నీవు నిజంగా రచయిత విరా. మనసా, వాచా కర్మణా రచయితవి"

"నిహో!"

"వాదేమిటి లెక్క! నాదంతా అవసర కవిత్వం అవసరానికి ఏది తోస్తే అది వ్రాసేస్తాను అంతే!"

జవాబివ్వలేదు శరత్.

"ఎంత కావాలి ?"

ఆశగా చూశాడు శరత్ 'బయటికి వెళ్ళకుండా వో పాతిక చేతికందితే కథ రాసుకోవచ్చు' అనుకుని "బాబ్బాబూ! ఈ గండం గట్టెక్కించు. థర్టీ ఫస్ట్‌కి కాఫీతో సహా ముట్టచెపుతాను" అన్నాడు

జేబులోంచి ముప్పై తీసియిచ్చి "ఇదిగో" అన్నాడు.

శరత్ ముఖం వెలిగిపోయింది. "చూడరా! తెలుగు రచయిత ఎంత అల్ప సంతోషో ముప్పై రూపాయలకే ముఖం విప్పారుతుంది" అన్నాడు.

"అవునవును" అని నవ్వాడు విరల్.

"ఆఁ నా అవసరం తీరిపోయింది. ఇక చెప్పు ఏమిటి సంగతి ?"

కొంచెం సందేహించాడు విరల్.

"ఏమిటోయ్"

"ఆఁ ఏం లేదు ఏదయినా మంచి కథ రెడీగా వుందా ?"

"ఎందుకు ?"

"చెప్పవోయ్"

'మనదగ్గర కథలు స్టాకుండవు. రాయటం. పంపించటం అవి పత్రికల ఆఫీసులో నయినా వుండాలి, అచ్చయినా కావాలి. అంతే."

పలకలేదు విరల్.

"ఎందుకో చెప్పరాదూ ?"

"వో మంచి కథ కావాలి."

"మనస్సులో వుంది"

"అంటే ?"

"ప్లాట్ రెడీగావుంది."

"చెప్పు విందాం"

సిగరెట్ ముట్టించి కథ చెప్పేడు శరత్. శ్రద్ధగా విన్నా విరల్.

"గుడ్! వెరిగుడ్!! నీలో మంచి యింప్రూవ్‌మెంటు వచ్చింది. కానీ చివర్న కథానాయకుడు చనిపోయే దానికంటే పిచ్చివాడయితే బావుంటుంది" అని మెచ్చుకుని మార్పుని సూచించాడు విరల్.

"వో! పిచ్చివాడంటే ఏమిటి ? సాంఘికంగా మరణించటమే కదా ? అలా మనిషిని

జీవచ్ఛవంగా వుంచేకన్నా చంపెయ్యటమే మెరుగు అన్నీ పోగొట్టుకున్న మనిషి బ్రతికినా అది బ్రతుకు కాదు. లొక్కురావటం. అభిమానవంతుడైవాడు అలా వుండలేడు."

"పలాయన వాదమంటారేమో ?"

"నో! నో! నథింగ్ డూయింగ్, జాబ్ పోయి, భార్యపోయి, పిల్లలు భ్రష్టులై పూట గడవటం కష్టంగావున్న స్థితిలో మనిషి బిచ్చగాడుగా బతగ్గలడా ? ఇంపాసిబుల్, ఆత్మాభిమానం వున్న వాడెవడయినా ఆత్మహత్య చేసుకుంటాడు లేదా గుండె టక్కున ఆగి చస్తాడు. ఆఁ దారి ఒంది వెరీగుడ్ ఎండింగ్. గుండె ఆగి చనిపోయినట్టు రాస్తే బావుండదూ?"

నవ్వాడు విరల్, "చెప్పానుగా నీలో

# తారాబలం

రచయిత పెరుగుతున్నాడని ఆఁ ఇంతకీ యీ కథ దేనికి పంపుతున్నావ్ ?"

'దీపావళి కథలపోటీకి'

'దేనికి ?'

చెప్పాడు శరత్.

"గుడ్ ! తప్పకుండా నీ కథకి ప్రైజ్ వస్తుంది."

నిట్టూర్చాడు శరత్ "ప్రయిజ్ వస్తుందో రాదో ! అది తర్వాత. రచయితగా పోటీలో పాల్గొనాలి. ఫలితం తర్వాత. కథ తృప్తికరంగా వచ్చిందా లేదా అనేది నా మనస్సుకి నేను జడ్జి చేసుకోవాలి అంతే !"

ఒక్కక్షణం మౌనం వహించాడు విరల్.

"శరత్ !"

"ఏమిటి ?"

"ఒక మాట చెపుతాను విపరీతంగా అనుకోవుకదూ ?"

"ఊఁ మనమధ్య మనకేమిట్రా ? చెప్పు"

"నీవూ ప్రతి సంవత్సరం పోటీకి పంపుతున్నావుకదా ?"

"ఆఁ పదహారేళ్లనుంచి పంపుతున్నాను"

"ఒక్కసారయినా ప్రయిజ్ వచ్చిందా ?

శరత్ ముఖం నల్లబడింది "అలా అంటే ఏం చెప్పను? నా విషయం యిపుడే చెప్పానుగా ?" అన్నాడు

"సారీ ! నిన్ను హర్ట్ చేయాలనికాదు. విషయం అడిగాను."

"నిజమే"

"నీ కథలన్నీ తర్వాత ఎక్కడో ఓ చోట అచ్చయ్యాయి కదా !"

"అవును"

"అయినా ప్రయిజ్ రాలేదు. అంటే నీ పేరులో ఏదో లోపం వుంది. నీకు సాహిత్య గౌరవం అంతకంటే దక్కే యోగ్యత లేదు అనుకోవాలి. కేవలం అచ్చవుతాయి నీ రచనలన్నీ. సీరియల్స్‌గా, ప్రైజ్ పొందిన రచనలుగా రాణింపుకిరావు. మళ్లీ నీ రచన చచ్చుగా వుంటుందా అంటే శత్రువుకూడా అన్లేడు. నో - పిండితార్థం ఏమిటి ? నీ జాతకం అంతేనన్నమాట."

నవ్వేడు శరత్ "బావుంది నీ ఆర్గ్యుమెంట్ అలా ఎప్పటికీ జరగదు. నే చూస్తూనే వున్నానుగా. ప్రైజ్ పొందినవన్నీ మన రచనకంటె ఉన్నంతగా వున్నాయ్"

"నీకూ ప్రయిజ్ వచ్చివుంటే వాళ్ళూ అలాగే అనుకునేవారేమో ?"

"ఏమో ? ఇంతకీ నీ ఫలితాంశం ఏమిటి ?"

"ఆఁ ఏం లేదు. ఇప్పుడు నీవు చెప్పావే ? ఆ కథ. అది నాకు భాగా నచ్చింది. ఆ కథ వ్రాసి నాకు యిచ్చేయ్. నా పేరుతో పంపుకుంటాను"

"పంపుకోరా ! దాన్దేవుంది. ఎవరి పేరుతో వస్తేనేం ?"

"అలా తేలిగ్గా కొట్టి పారెయ్యకు. రేపు దానికి ఏదో ప్రయిజ్ రావచ్చు. ఆ కథ సినిమాకి పనికి రావచ్చు. అప్పుడు బాధ పడతావ్"






"బాధేముంది? నా పేరుతో కాకున్నా నీ పేరుతోనన్నా నా రచన పేరుకొస్తూ వుందిగా?"

"అవ్వడు నా రచన అనటానికి నీకు హక్కేం వుంది"

శరత్ మాట్లాళ్ళేదు.

"అందుకే నేనో పద్ధతి ఆలోచించాను నీ కథని నాకు అమ్మేయ్"

చిత్రంగా చూశాడు శరత్.

"యస్. అమ్మేయ్ అన్ని హక్కులతో అమ్మేయ్"

"విరల్!"

"అవునా శరత్! ఈ ఊహ నా మనసులో చాలా రోజుల నుంచి నానుతోవుంది కేవలం ప్రత్యేక బహుమతి పొందినా రెండొందలు వస్తాయి ఇదిగో ఆ రెండొందలూ వుంచుకో— తర్వాత నీ కథకి ప్రయిజొస్తే ఏ ప్రయిజయినా ఫిఫ్టీ ఫిఫ్టీ. రైట్స్ మాత్రం నావి"

"విరల్! చాలా చిత్రంగా వుంది నీ వ్యవహారం"

"చిత్రం కాదురా! వ్యవహారం ముందు ముఖమాటాలు పనికిరావు. డబ్బిదిగో తీసుకుని కథ రాసిచ్చెయ్. ఫలితం వేచి చూడు. కావాలంటే నీవూ మరోమంచి కథ పోటీకి పంపుకో నా కభ్యంతరం లేదు కానీ యీ కథ నాకు కావాలి. అంతే!"

నవ్వొచ్చింది శరత్‌కి.

"ఒరే విరల్! నా బుద్ధి కథలకి



కొర్కొ! ఈ కథేం బంగారు కొమ్ములతో మొలుచుకుని రాలేదు అలాగే నీ యిష్ట ప్రకారమే తీసుకో రేపురా కథ యిచ్చేస్తాను" అన్నాడు శరత్.

"థాంక్స్! ముందుగా చెపుతున్నాను తర్వాత బాధ పడ్డా ఫలితం వుండదు. నేను చాలా స్ట్రిక్ట్."

పకపక నవ్వేడు శరత్.

"ఇదో కొత్తరకం అనుభవం— ఇదీ ఓ కథగా రాసుకోవచ్చు తర్వాత అలాగేకానీలే"

'తాంబూలాలు తెప్పించు' అని ఆకులూ వక్కలూ తెచ్చాక అందులో రెండు వందల పదహార్లు పెట్టి యిచ్చి నమస్కరించాడు విరల్.

శరత్‌కి అదంతా నవ్వులాటగా వుంది

"వస్తా! ఆలస్యం చేయకుండా దంచు! విష్ యు బెస్ట్ ఆఫ్ లక్" అని లేచాడు విరల్.

"అది నీ లక్!" అన్నాడు శరత్ నవ్వి.

* * *

మూడవరోజు ఉదయం స్వయంగా వెళ్ళి విరల్ ఇంట్లో అతనికి కథ ఇచ్చాడు శరత్.

"ఇదిగో శరత్! ఇప్పటికయినా మించి పోయింది లేదు నీ కథ నీవు తీసికెళ్ళొచ్చు. కావాలంటే నా డబ్బు ప్రయిజొచ్చాకే యివ్వొచ్చు" అన్నాడు విరల్.

ఫక్కున నవ్వేడు విరల్.




"అప్పుడే ప్రైజు వచ్చినట్లుగా మాటాడుతున్నావు అయినా నాకేం ఆలోచన లేదు. దత్త పుత్రుడు పేరు ప్రతిష్టలు సంపాదించుకుంటే జనక తండ్రి ఆనందించడా?"

"ఇక్కడ ఆ ప్రసక్తి కూడా లేదు. గుప్తంగా దానం చేసినట్లుగా వుంటుంది"

"ఒరేయ్! ఈ కథ ఎవరిదో లోకానికి తెలియక పోయినా నీకూ నాకూ తెలుసు. అది చాలు నాకు"

"సరే! నీ యిష్టం" అని ఆ కథ అందుకుని చకచకా చదివేశాడు విరల్. అతని ముఖంలో ఆనందం తాండవిస్తోంది.

"శరత్! ఈ కథ ప్రపంచ కథానికల పోటీకి ప్రథమ ప్రైజొస్తుందిరా! థాంక్స్ ఎలాట్" అని యింట్లోకి వెళ్ళి కొత్త కాశ్మీర్ శాలువా తెచ్చి శరత్‌కి కప్పి "ఇదిగో యిదే నీ కథమీద నీకు దక్కే ఆఖరి సన్మానం" అన్నాడు

విరగబడి నవ్వాడు శరత్ అతని కంతా పిచ్చి పిచ్చిగా వుంది. యీ చేష్టలన్నీ తమాషాలా కనిపించాయ్.

"వస్తా(నా" అని వెళ్ళిపోయాడు శరత్

* * *

నిజం కల్పనకంటే కూడా విచిత్రంగా వుంటుంది

అనుకున్నవి జరిగినవాడు మనిషి ఎంత ఆశ్చర్యపడతాడో, ఆనందపడతాడో అనుకోనివి జరిగినవాడు అలాగే దుఃఖపడతాడు విచారపడతాడు.

శరత్ పట్టుదలతో అంతకంటే మంచి సబ్జెక్ట్ ఎన్నుకుని, వాటికంటే బలమైన సంఘటనల్ని సృష్టించి, మాంచి పవర్‌ఫుల్ డైలాగ్స్ అణిముత్యాల్లాంటికో టేషన్స్



# పసి డాక్టర్!

ఏమో ఎవరికి తెలుసు! ఒకానొకరోజు అతను నిజంగా డాక్టరే అవుతాడేమో! ఎందుకంటే వయస్సుతోపాటే అతని కోరికలు కూడా పెరుగుతూ, కలలలోనుంచి వాస్తవికతకు తీసుకు వెళ్తూంటాయి. అతనికి మీరు చేయవలసిన సహాయము, అతని అభిరుచులను సక్రమమైన దారిలోనికి మళ్ళించిపెట్టే, అతను యోగ్యమైన పనిని ఎన్నుకొంటాడు. అందుకని అతను ఆడుతూ పాడుతూ పెరిగే వయస్సులోనే అతని భవిష్యత్తు గురించి ఆలోచించండి. అతని చిన్నారి కలలను వాస్తవము చేసుకొందుకు, అతనికి ఒక అతి ప్రత్యేకమైన బహుమతి నివ్వండి

పిల్లల బహుమతి పథకం. మీ బిడ్డకు తన స్వంత మొత్తం సమకూర్చుతుంది. ఈ మొత్తం మీ బిడ్డతోపాటు అతి సురక్షితముగా పెరుగుతుంది. ఈలోగా ఆ మొత్తాన్ని ఎవరూ కూడా తాకలేరు. అబ్బాయికి 21వ ఏట (అమ్మాయికి 18వ ఏట) ఒక పెద్ద మొత్తం చేతికి దొరుకుతుంది. మీ బిడ్డ తన కోరికలను తీర్చుకొందుకు ఈ వయసులోనే గదా ఆ పెద్ద మొత్తం కావలసివచ్చేది.

నేడే అతనికి పిల్లల బహుమతి పథకాన్ని కానుకగా ఇవ్వండి. అతని చిన్నారి కలలకు సుందర రూపాన్ని ఇవ్వండి.

ఇంకా అనేక రకాల విశేషములు కూడా ఉన్నవి. ఈ పథకములో చేరబోయే పిల్లలకు మేము ఒక బహుమతిని కూడా ఇస్తాము. ఇంకా ప్రతిసంవత్సరము పెద్ద నగదు బహుమతులతో మా ఒక లక్కీ డ్రా కూడా ఉంది. మీ బిడ్డ గెలుచుటకు అనేక అవకాశములు కూడా ఉన్నవి! నేడే చేరండి! పిల్లల బహుమతి పథకం వారి భావికి రాచబాట!

**మీ పొదుపుకు-మెట్లు యూనిట్లు.**

**యూనిట్ ట్రస్ట్ ఆఫ్ ఇండియా**

ఇంకా ఇతర సమాచారమునకు దయచేసి
మా అతి దగ్గర ఆఫీసును సంప్రదించండి:

- 45, వీర్ నారిమన్ రోడ్, బొంబాయి 400 023
- 9, మేథ్యూ రోడ్, బొంబాయి 400 004.
- 8, కౌన్సిల్ హౌస్ స్ట్రీట్, కలకత్తా 700 001.
- 6, రిజర్వ్ బ్యాంక్ బిల్డింగ్, పార్లమెంట్ స్ట్రీట్, న్యూ ఢిల్లీ 110 001.
- రిజర్వ్ బ్యాంక్ బిల్డింగ్, ఫోర్ట్ గ్లాసిస్, మద్రాస్ 600 001.

Sista s-UTI-878 Tel 77

# వంటలు

## పులావ్

పులావ్ చేయుటకు కావలసినవి : ఉల్లి గడ్డ, బంగాళ దుంపలు, పచ్చి బటానీలు, బీన్స్ లేక గోర్చిక్కుడుకాయలు, కారట్లు. మొదటి రెండు అవసరము. అన్నీ కలిపి 250 గ్రాములు. ఉల్లిగడ్డ సన్నగాను, మిగతా కూరలు కొంచెం పెద్ద ముక్కలు గాను తరిగి ఉంచుకోండి.

జీడిపప్పు, లేక ముందుగా వేయించి పొట్టుతీసిన వేరుశనగపప్పు.

కొద్దిగా లవంగాలు యేలకులు, దాసించెక్క, షాజీరా (అసలుది), అల్లం, పచ్చి మిరపకాయలు, పొదినా, కొత్తిమేర కొంచెం ఉప్పువేసి రుబ్బిన కారం. ఇష్టమున్నవారు వెల్లుల్లి, కూడా వేసి రుబ్బవచ్చును. పులావ్ ఎక్కువ కారం వుండకూడదు, అందుకని ఇవన్నీ తగుమాత్రమే వేయవలయును

పాత బియ్యం- 250 గ్రాములు

ఒక వెడల్పు భాండీగాని, గిన్నెలోగానీ సన్నగా తరిగిన ఉల్లి ముక్కలు, జీడిపప్పు, ఒక 100 గ్రా. నూనెలో ఎర్రగా వేయించండి తర్వాత అందులోనే, లవంగాలు, యేలకులు, దాసించెక్క ముక్కలు, షాజీరా ఇతర కూరముక్కలు కూడా వేసి ఇంకొక 5 నిమిషములు వేయించండి. ఇప్పుడు బియ్యానికి సరిపోయే నీళ్ళు పోసి పొంగురానివ్వండి. ఈ పొంగునీళ్లల్లో రుబ్బిన కారం, బియ్యంవేసి అన్నం ఉడకనివ్వండి. నిప్పు మీదనుంచి దించేముందు బాగా కలపండి దించేముందు కావలసినవారు కొంచెం కుంకుమ పువ్వు లేక తినే రంగు వేయవచ్చును.

Printed and Published by S. NageswaraRao at the Andhra Patrika press, MallikarjunaRao Street,
Gandhinagar, Vijayawada-3. Editor: S. Radhakrishna

లోకంపోకడ—ఊమెన్




## రెండవ బహుమతి వ్యాసం

(8 వ పేజీ తరువాయి)

ప్రచురించిన కథల స్థాయి, గత ఏడాది కథల స్థాయి కన్నా దిగజారి పట్టుని పించింది. ఈ సారి నేను చదివిన దీపావళి కథలపై నా అభిప్రాయం యిలా వుంది.

'వన్‌మినిట్' కథ నా దృష్టిలో ప్రథమస్థానం పొందింది. కథలో సహజత్వం ఉన్నది. ఒక్క నిముషం ఆలస్యమైతే కలిగే పరిణామాలు, వాటి ఫలితాలు సర్వరు పాత్ర ద్వారా చక్కగా వివరించారు. తన కూతురి పెళ్లి కివ్వవలసిన కట్నం కోసము మధ్య తరగతి తండ్రి ఎంతగా ఆరాట పడతాడో చాలా బాగా వర్ణించారు శేఖరం పాత్ర మార్గదర్శకంగా ఉంది. కథ నడిపించిన తీరు చాలా బాగుంది.

'కలకాలం నిలిచేది' కథ చదువుతున్నంత సేపు కొన్ని భగ్నప్రేమ కథలు గుర్తొచ్చాయి. కొత్త సీసాలో పాత సారాయి పోసినట్టనిపించినా పాత రుచి మాత్రం లేదు. ప్రేమ అనేది మనిషికి ఎంతో ధైర్యాన్ని యిస్తుంది, ఎన్ని కష్టాలున్నా భరింపగల శక్తిని ప్రసాదిస్తుందని ఈ కథ ద్వారా చక్కగా సులభ శైలిలో వివరించారు.

'కామాక్షి కోరికను' బట్టి ఆమెకు వెండిగిన్నె చాలా యిష్టమైనదిగా, అత్యంత ప్రీతి పాత్రమైనదిగా భావించుకోవచ్చు. అలాంటి వెండిగిన్నె ఎదురైనప్పుడు ఆమె యొక్క ప్రవర్తన విచిత్రంగా మారింది. ఆడదాని చంచల బుద్ధిని, అసూయను ఈ కథలో చూశాను.

'ఆనందానికి ముందు వెనుకలు' కథ వ్రాసేటప్పుడు రచయిత(త్రి) 'ముందు వెనుకలు' చూసుకో లేదను కొంటాను. బి. ఏ. కోర్సులో, లెక్కలున్నట్లు యింత వరకు నాకు తెలియదు. కథను వర్ణించిన తీరు చాలా బాగుంది. మార్గదర్శకంగాఉంది.

'పేరులేని కథ' పేరుకు తగ్గట్టుగా ఉంది. ఆశించినంత బాగాలేదు. అసహజత్వం ఎక్కువగా ఉంది. అయినా కథ కొత్త రీతిలో సాగింది.

మున్ముందు దీపావళి కానుకలుగా మంచి, మంచి కథలు ప్రచురిస్తారని ఆశిస్తున్నాను.

—యం. హెచ్. బేగం. ●



ముగ్గులు పెడుతున్న నూతన తార మాధవి

